Regd. No. H.N.L. 18

21-5-1993

# వైఎస్ ఇంటి సోదాతో మైసూరా మంత్రిత్వానికి ముప్పు ఎ?

అక్రమంగా మారణాయుధాలు దాచి వుంచారన్న అభియోగం పై కడపలోని డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి క్యాంప్ ఆఫీసును పోలీసులు సోదా చేసిన సంఘటన రాష్ట్ర రాజకీయాల్లో పెనుతుఫాను సృష్టించే అవకాశాలు కనిపిస్తున్నాయి. ఆకాశ రామన్న అందించిన సమాచారం మేరకు కడప పోలీసులు వైఎస్ కార్యాలయం పై దాడి చేసి గాలింపు చర్యలు చేపట్టినా వారికి ఎటువంటి ఆయుధాలు పట్టుబడలేదు. వైఎస్ కార్యాలయంలో ఆయుధాలు దాచి వుంచారన్న సమాచారం పోలీసులకు ఎవరిచ్చారు? ఒక ఎమ్పీ కార్యాలయాన్ని సోదా చేసే ధైర్యం జిల్లా పోలీసులకుందా? అందులో వైఎస్ కార్యాలయంలో అడుగు పెట్టాలంటే చిన్న విషయం కాదే! ఈ సంఘటన వెనుక అదృశ్య శక్తి ఏదైనా వుందా? అన్న ప్రశ్నలకు వై.ఎస్. వర్గీయులు చెప్పే సమాధానం ఒక్కటే. వైఎస్‌ను రాజకీయంగా అపకీర్తిపాలు చేసేందుకు హోంమంత్రి డాక్టర్ మైసూరా రెడ్డి పన్నిన కుట్రలో భాగం ఇది. హోంమంత్రి తనంతట తానుగా ఈ పనికి పూనుకున్నారా? లేక ముఖ్యమంత్రి అనుమతి కూడా పొందారా! అన్న విషయం వై.ఎస్. వర్గీయుల్ని వేధిస్తున్న ప్రశ్న. ఇదే విషయాన్ని వై.ఎస్. వర్గీయులైన ఎమ్మెల్యే డాక్టర్ శివరామకృష్ణ ముఖ్యమంత్రిని కలిసి వివరిస్తే ఆయన తెల్ల మొహం వేసి తనకేమీ తెలియదన్నారు. వై.ఎస్. మద్దతు దారులందరినీ పోలీసుల సోదా సంఘటన మానసిక వ్యధకు గురి చేసింది. ఈ విషయంలో తాడో పేడో తేల్చుకోవాలని వారు నిర్ణయించుకొన్నారు. పోలీసులు గాలింపు

కొరవ 8 పేజీలో



15 తేది ఎన్నికల ప్రచారానికి నెల్లూరు వచ్చిన ముఖ్యమంత్రి విజయభాస్కర రెడ్డిని హెలిపాడ్ దగ్గర స్వాగతిస్తున్న మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్ధన రెడ్డి, మంత్రి రోశయ్య, ఎమ్మెల్యే జె.కె. రెడ్డి

జమీన్‌రైతు

## పిసిసి ముళ్ల కిరీటం అలంకరణ

# వద్దన్నా రోశయ్యను వదిలేట్లు లేదు!

వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీని సమాయత్తం చేసి తెలుగుదేశం పార్టీని చిత్తుగా ఓడించేందుకు ఆర్థిక మంత్రి రోశయ్యను పిసిసి అధ్యక్షుడిగా చేయాలని ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి నిర్ణయించారు. వెనుక బడిన తరగతులకు చెందిన మాజీ మంత్రి మదన్‌మోహన్‌ను పిసిసి అధ్యక్షుడిగా చేయాలని ముఖ్యమంత్రి భావించారు. అయితే మదన్ మోహన్ విముఖత వ్యక్తం చేయడంతో కోట్ల వారు రోశయ్యను ఎంపిక చేసుకున్నారు. కాని మంత్రి పదవి వదులుకొని పిసిసి పీఠం ఎక్కటానికి రోశయ్య అంగీకరించటం లేదు. మంత్రి పదవితో పాటు పిసిసి బాధ్యతలు ఇస్తే రెండు గుర్రాల పై స్వారీ చేయడానికి తాను సిద్ధమని రోశయ్య అంటున్నారు. గతంలో కేంద్ర మంత్రిగా వున్న జలగం వెంగళ రావు పిసిసి అధ్యక్షుడిగా వున్న విషయాన్ని రోశయ్య గుర్తు చేస్తున్నారు. ఇదే విషయాన్ని ఇటీవల ఢిల్లీకి వెళ్లినపుడు ముఖ్యమంత్రి పార్టీ అధ్యక్షుడు పి.వి. నరసింహా రావుతో మాట్లాడారట. అయితే రెండు పదవులకు పి.వి. సుముఖంగా లేనట్లు తెలియవచ్చింది. రాష్ట్రంలో పార్టీ పరిస్థితి గడ్డుగా వున్న ఈ దశలో వనరుల సేకరణ, ప్రచారం వంటి కార్యక్రమాలకు రోశయ్య ఒక్కడే తగిన వాడని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. రెండు పదవులకు పి.వి. అంగీకరించలేదు కాబట్టి మంత్రి పదవి వదలి పిసిసికి

కొరవ 8 పేజీలో





**NCS** రెసిడెన్షియల్ జూనియర్ కాలేజి

రోహిణి నగర్ (ముత్తుకూరు రోడ్డు), నెల్లూరు - 524 003. (A.P)

అనుభవపరులైన అధ్యాపకులచే

**INTER** బోధన మరియు **EAMCET**

శిక్షణ విద్యా సంవత్సరమునకు

జూనియర్ ఇంటర్ అడ్మిషన్లు జరుగుచున్నవి.

**17.5.93** నుండి సీనియర్ ఇంటర్ క్లాసులు ప్రారంభమైనవి.

సీనియర్ ఇంటర్ చేరదలచిన వారికి ప్రవేశము కలదు.

గ్రూపులు: **M.P.C.** మరియు **Bi.P.C.**,

మీడియం: ఇంగ్లీషు / తెలుగు

బాలబాలికలకు ప్రత్యేక హాస్టలు వసతి కలదు.

సెమి-రెసిడెన్షియల్ సౌకర్యము కలదు.

నెల్లూరులో నివసించు బాలికలకు బస్సు/వ్యాను సౌకర్యము కలదు.

- **K.S. Rao,** Correspondent

# పొగాకు రైతు గుండెల్లో పొగ

నిన్న పత్తి రైతు. నేడు పొగాకు రైతు. రేపు వాస్మం రైతు.... ఇదేం శాపమో గానీ మట్టిని పిసికి బంగారం పండించే రైతులు రోడ్డు పాలయ్యే పరిస్థితి రోజులకు అంతం లేకుండా వుంది. గిట్టుబాటు ధరలేమయినాయి. ఇళ్ల వసారాల్లో మగ్గుతున్న పొగాకు కొనే నాథుడే లేక పొగాకు రైతులు వీధుల్లో పడ్డారు. నెల్లూరు జిల్లాలోని ఉదయగిరి, కావలి, ప్రకాశం జిల్లా, గుంటూరు జిల్లా పొగాకు రైతులు రాస్తారోకో పేరిట ఆందోళనకు దిగారు. కష్టాల్ని, కాసుల్ని ఇల్లాళ్ల పుస్తెల్ని కరిగించి దొర పొగాకు బేళ్లగా పేర్చుకున్న రైతులు అమ్మకాల కోసం పొగాకు బోర్డు ప్లాట్‌ఫారాల మీద 'బికారుల్లా' వేచి వుంటున్నారు. అయినా పొగాకు బోర్డు మాత్రం తనకేం పట్టనట్లు వ్యవహరిస్తోంది. ప్రతి యేటా మార్కెట్లో పెద్ద ఎత్తున పొగాకు కొనే ఐటిసి కూడా ఈసారి ధరలతో దోబూచు లాడుతూ రైతుల కష్టాన్ని దోచుకోవాలని చూస్తోంది. వేసవి ఎండలా మండుతున్న పొగరైతు గుండె మరో 'బంగుటూరు' ఉదంతానికి దారితీస్తుందేమో నన్న భయం ఎక్కువవడంతో రాష్ట్ర ప్రభుత్వం దిగివచ్చి పొగాకు కొనుగోళ్లకు తన వంతు కృషి చేస్తోంది. అయినా పొగాకు బేళ్లకు మాత్రం మోక్షం కలగటం లేదు.

## జూదంగా మారిన పొగాకు సేద్యం

మన రాష్ట్రంలో పొగాకు సేద్యం జూదంగా మారింది. పరిస్థితులు బాగుండి పొగాకుకు మంచి ధర పలికితే రైతు రాత్రికి రాత్రే రాజై పోతున్నారు. పరిస్థితులు ప్రతికూలిస్తే రాజంతటి రైతు కూడా బికారి అవుతున్నారు.

1990 - 91 లో రాష్ట్రంలో పొగాకు రైతుల పంట పండింది. అప్పట్లో కిలో పొగాకు 37 నుంచి 40 రూపాయల దాకా అమ్ముడైంది. దీనితో రెచ్చిపోయిన రైతులు 91 - 92 సంవత్సరంలో ఎక్కువ విస్తీర్ణంలో పొగాకు సాగుచేశారు. దిగుబడి పెరగటంతో ప్రయివేటు కంపెనీలు ఒక్కసారిగా కిలో పొగాకు ధరను 27 రూపాయలకు తగ్గించేశాయి. అయినా ఆశ చావని రైతు ఈ ఏడాది కూడా పొగాకు పై పందెం కాశారు. పొగాకు బోర్డు, ఐటిసి

> **కష్టాలు, కాసులు ఇల్లాళ్ల పుస్తెలు పొగాకు బేళ్లుగా పేర్చిపెట్టారు!**

వంటి కంపెనీలు కూడా ఈ ఏడాది పొగాకు పంటను ప్రోత్సహిస్తూ ప్రచారం చేశాయి. దీనితో పొగాకు బోర్డు విధించిన పరిమితిని మించి రైతులు పొగాకు వేశారు. పొగాకు బోర్డు అంచనాల ప్రకారం ఈ ఏడాది 103 మిలియన్ టన్నుల పొగాకు దిగుబడి రావల్సి వుండగా వాతా వరణ పరిస్థితులు బాగుండటం కానివ్వండి, రైతుల పేరాశ ఫలితం కానివ్వండి మొత్తం 130 మిలియన్ టన్నుల పొగాకు దిగుబడైంది. ఇంకేముంది తాము నిర్దేశించిన పరిమితుల కంటె ఎక్కువ విస్తీర్ణంలో పంట వేశారని పొగాకు బోర్డు అలక పాన్పు ఎక్కింది. దిగుబడి ఎక్కువ కావటంతో ఐటిసి వంటి ప్రయివేటు కంపెనీలు ఎగిరి గంతేశాయి. దీనికి తగినట్లుగానే రష్యాకు ఎగుమతి తగ్గటంతో ప్రయివేటు కంపెనీలకు వెళ్లొచ్చాయి. కిలో 17 రూపాయలకు మించి పైసా కూడా ఎక్కువ ఇవ్వలేమని ఐటిసి భీష్మించు క్కూర్చుంది. 103 మిలియన్ టన్నులకు పొగాకు బోర్డు హామి ఇచ్చింది కాబట్టి ఆ మేరకైనా పొగాకును గిట్టుబాటు ధరకు కొనుగోలు చేయాలని రైతులు కోరుతున్నారు. రష్యాకు ఎగుమతి లేదు కాబట్టి మేం చేసేదేమీ లేదని బోర్డు అధికారులు చేతులెత్తేశారు.

## ముఖ్యమంత్రి చొరవ

పొగాకు రైతులను ఆదుకునేందుకు ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి చొరవ తీసుకొని కేంద్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపారు. రాష్ట్రంలో పొగాకు వ్యాపారస్తులైన రాయపాటి సాంబశివ రావు, ఏఎస్ చౌదరి తదితరులతో ముఖ్యమంత్రి చర్చించి, వెంటనే పొగాకు కొనుగోళ్లు చేయాల్సిందిగా కోరారు. ఐటిసితో కూడా ముఖ్యమంత్రి మాట్లాడారు. ఈలోగా ఎస్‌టిసిరంగంలోకి దించి పొగాకు కొనుగోళ్లను ప్రారంభిస్తామని హామీ యిచ్చారు. అయితే ఇంత వరకు కొనుగోలు ప్రారంభమైన దాఖలాలు లేవు. పొగాకు రైతులు మాత్రం రోడ్డెక్కి ఆందోళన చేస్తూనే వున్నారు. పొగ మారిన పొగాకు రైతుల గుండెలకు ఉపశమనం ఎప్పుడో?

# పినాకినీ తీరం

## ఏమవుతుందో!

ఈ పత్రిక పాఠకుల చేతికందేలోగానే, గూడూరు ఎన్నిక ఫలితం వెలువడిపోతుంది. అటువంటప్పుడు ఏమవుతుందో అని ఆదుర్దాగా వ్రాయడం వ్యర్థం గదూ! కలం పులబాటం అటువంటిది; ఏమి చేయమంటారు!

నలుగురిలో ఎవరో ఒకరు గెలవాలి – ఆ ఒకరు ఎవరు? ఆ రహస్యాన్ని బ్యాలెట్ బాక్సులు భద్రంగా దాచి వున్నాయి; శుక్రవారం సాయంత్రానికి బయట పెట్టేస్తాయి. పొట్ట పుబ్బరం – అంత ఓపిక పట్టేదెట్లా?

పోలింగు పూర్తయి తిరిగి వచ్చిన వారి నుండి బుధవారం సాయంత్రం కబుర్లు వింటూంటే తియ్యగా నోరూరింది. అటువంటిది గురువారం వుదయానికల్లా నీరుగారడం మొదలైంది. సాయంత్రానికి నిరాశ మిగిలింది. గెల్చే వారి సంబరం, ఓడే వారి అవమాన విచారాలు వుండనే వుంటాయి; శుక్రవారం సాయంత్రం ఏ కబురు తెస్తుందోననే టెన్షన్ మనలను తినేస్తుంది; తప్పదు.

నలుగురు పోటీలో వుండి ఈ ఎన్నిక వలె వూహకందని పరిస్థితి నెలకొన్న ఎన్నిక మన జిల్లాలో వున్నట్లు నా స్మృతికి రావడం లేదు. మబరాలో, కాలనీలతో సహా ప్రతి గ్రామాన్ని, ప్రతి ఇంటిని, ప్రతి ఓటరును ఇంతగా ముట్టడించబడిన ఎన్నిక కూడా కనపడదం లేదు. నాయకులు, కార్యకర్తలు, నిష్పాక్షిక పోలింగుకు జరిగిన కఠినమైన ఏర్పాట్లు, ఎంత ముఖ్యులనైనా నిలదీయ గలిగిన అధికార్ల నిర్భీక వర్తన, వాగ్దానాల జల్లు, ధన ప్రవాహం, పసికట్టడానికి బ్రహ్మతరం కూడా కాని ఓటరు మహాశయుల నిగూఢ గంభీర మనోగతం... ఒక్కటేమిటి, అన్ని విషయాల్లో ఇంత భారీగా కేంద్రీకృతంగా, గుంభనంగా జరిగిన వుపఎన్నిక కూడా ఎరుగము. ఈ ఎన్నిక ఫలితం నిజమైన ప్రజాభిప్రాయానికి ప్రతిబింబంగా తీసుకో దగి వుంటుందేమో!

బిజెపికి ఆశే లేదు; ఎంత నిలిగినా సి.పి.ఎం. కు గెలిచే అవకాశం లేదు. ఇక మిగిలింది కాంగ్రెసు – తెలుగుదేశాలు. కాంగ్రెస్ అభ్యర్థి పాత వాడు, పెద్దవాడు, పెద్ద పదవిలో వున్నవాడు, దేశ ప్రధాని అంతటి ప్రధానుని అభిమాన ఆశీర్వాదాలున్నవాడు, సమైక్యమైన పార్టీయే కాకుండా, మాటకు ఎదురులేని మాగుంట సుబ్బరామిరెడ్డి గారి అండ గలిగిన వాడు, కొరత లేని వాడు; తెలుగుదేశం అభ్యర్థి యువకుడు, పరాయి ప్రాంతం వాడు, ప్రత్యక్ష రాజకీయాలకు కొత్త వాడు, తండ్రి పేరు – తల్లి సానుభూతి – పార్టీ సర్వస్యపు అండ, మార్గ దర్శకత్వం గలవాడు.

కొరవ 11 పేజీలో


## హెచ్చరిక

నెల్లూరు చర్చి గ్రౌండ్స్‌లో నిర్వహింపబడుచున్న ఇండ్రస్టియల్ ఎగ్జిబిషన్‌నందు స్టాల్ నెం. 19లో నెలకొల్పబడి వున్న "బ్లిస్ ప్లాంటేషన్స్ అండ్ హిల్ రిసార్ట్స్" అను సంస్థకూ మాకూ ఏ విధమైన సంబంధము లేదు. స్టాల్ నిర్వాహకులు మా సంస్థల యొక్క పేరును వాడుకుంటున్నట్లు తెలిసింది. కావున మా మిత్రులు, శ్రేయోభిలాషులు, ఖాతాదారులు అందరూ దీనిని గమనించవలసిందిగా కోరుతున్నాము.

ఇందుకు సంబంధించి 2–7–92న "ఇండియన్ ఎక్స్ ప్రెస్" పేపర్‌లోను, 2–8–92న "ది హిందు" మరియు 5–9–92న "ఈనాడు" పేపరులోను ప్రకటనలు కూడా ప్రచురించబడినవి. గమనించగలరు.

ఇట్లు

M/s. Balaji Trading Enterprises (P) Ltd., Bangalore–Madras.
M/s. Lavanya Enterprises, Bangalore–Madras.
M/s. Industrial Trading Corporation, Madras–Nellore.
M/s. Standard Packagings, Madras–Nellore.
M/s. Stanpacks (India) Pvt. Ltd.,. Madras
M/s. Prakash Finance Corporation, Madras.
M/s. Sudhakar Industries, Madras– Nellore.




M/s. Jumbo Bag Ltd., Madras
M/s. Poly Coat Packaging Industries, Madras
M/s. Gorantla Farms, Madras–Nellore
M/s. Standard Paper Industries Corp. Madras
M/s. Bilss Benefit Fund Ltd., Madras.
M/s. Sudhakar Financiers, Madras.
M/s. Balaji Trading Enterprises, Madras.

ROOPA ADS, PH : 25880

# జమీన్‌రైతు

## దారి తప్పుతున్నాయి!

కోవూరు, కైకలూరు ఉపఎన్నికలు ప్రశాంతంగా ముగిశాయి. కోస్తా జిల్లాలు కాబట్టి, ఇక్కడి ప్రజలలో హింసాత్మక ధోరణి లేదు కాబట్టి ఆ ప్రశాంతత. ఈ రెండు ఉపఎన్నికల సందర్భంగా చెలరేగిన ఉద్రిక్తత, ఆవేశ కావేషాలు ఏ రాయలసీమలోనో అయివుంటే నెత్తురు ఏరులై పారి వుండేది. ఆర్థికంగా, సామాజికంగా, అభివృద్ధి చెందిన ప్రాంతాలలో జనం చెప్పినట్లు నాయకులు నడవాల్సింది తప్ప, నాయకులు ఆడించినట్లు జనం ఆడరని రుజువైంది.

రాష్ట్రంలో మారిపోతున్న రాజకీయ చిత్రానికి కూడా ఈ ఎన్నికలు అద్దం పడుతున్నాయి. రాజకీయాలలో సేవ, త్యాగం, ప్రజాసాన్నిహిత్యం, వర్గబలం, ప్రజలలో పలుకుబడి వంటి అంశాలు తెరమరుగై కేవలం ధనబలం మాత్రమే అర్హతగా పరిగణన కు మ్యే పాతరోజులు మళ్లీ పునర్దర్శన మిస్తున్నాయి. పాత రోజులలో రాజకీయాలు లేదా పదవుల వేటలో కేవలం భూస్వాములు, రాజకీయాలే వృత్తిగా గల్గిన గుత్తాధిపత్య కుటుంబీకులు పాలుపంచుకొనే వారు. సామాన్యుడు, మధ్య తరగతి వారు ఎన్నికల జోలికే వెళ్లే వాడు కాదు. ఇందిరాగాంధీ పెత్తనంలోకి వచ్చిన తర్వాత ఆ సాంప్రదాయం తెరమరుగై, సమాజంలో అట్టడుగున వుండే వర్గాల వారు, పార్టీ సాధారణ కార్యకర్తలు ముందుకు వచ్చారు. 1972 ఎన్నికలలో ప్రయోగాత్మకంగా ప్రారంభమైన ఈ మార్పు, 1978 అసెంబ్లీ ఎన్నికలలో పూర్తి స్వరూపాన్ని సంతరించుకున్నది. గ్రామ సర్పంచ్‌లు, బస్ కండక్టర్లు, బస్టాండులో పండ్లు అమ్ముకునే వారు, డాక్టర్లు, లాయర్లు, పార్టీ కోసం వళ్లు వంచి పని చేసే కార్యకర్తలు ఎమ్మెల్యేలు కాగల్గారు. ఈ ప్రయోగానికి ప్రజల నుంచి అనూహ్య ఆదరణ ఎదురైంది. బడాబడా నాయకులు, ధన స్వాములు సామాన్యుల చేతిలో చిత్తుగా ఓడిపోయారు. దురదృష్టవ శాత్తు ఈ మార్పు పట్టుమని పదేళ్లు కూడా నిలువలేక పోయింది. ఎన్టీఆర్ రంగప్రవేశంతో మరొకసారి పరిస్థితి మారి పోయింది. ఇరవయ్యేళ్ల క్రితం భూస్వాములు చేసిన పెత్తనాన్ని ఇప్పుడు ధనస్వాములు, కాంట్రాక్టులతో కోట్లార్జించిన వారు, పారిశ్రామిక వేత్తలు చలాయించ జూస్తున్నారు. 1985, 1989 ఎన్నికలలో ఎన్టీఆర్ టిక్కెట్లు ఇచ్చిన అసెంబ్లీ, పార్లమెంట్ సభ్యుల వివరాలు పరిశీలిస్తే ఈ తేడా కొట్ట వచ్చినట్టు అర్థమౌతుంది. కాంగ్రెస్ కూడా అదే కోవలో పయనిస్తున్నది. ఆయా నియోజక వర్గాలలో ప్రజలతో సంబంధాలు పెట్టుకొని, ఏళ్ల తరబడి ప్రజల అవసరాలు చూసి, పార్టీని బ్రతికించి వుంచే కార్యకర్తలు, నాయకులు టిక్కెట్ల పంపకం దగ్గరకు వచ్చేసరికి అసమర్థులుగా, అనర్హులుగా మిగిలి పోతున్నారు. డబ్బు సంచులతో ఆ రోజు కారోజు పై నుంచి విమానం దిగే బడాబాబులు విజయావకాశాలు కల్గిన వారుగా వెలుగులోకి వస్తున్నారు. తెరముందు రంగు పూసుకొని, అభ్యాసంతో రిహార్సల్స్‌తో నటనానుభవం పెంచుకున్న నటులను ప్రక్కకు త్రోసి, తెరవెనుక నుంచి వచ్చిన వారు అవకాశాలు తన్నుక పోతున్నారు. ఈ పరుగులో సాధారణ రాజకీయ వాది ఎన్నికల ప్రస్తావన తెచ్చే పరిస్థితి లేకుండా పోతున్నది. కైకలూరులో కాంగ్రెస్ అభ్యర్థి ఎవరు? అతడికి ఏమి రాజకీయానుభవం వుంది? ఆ ప్రాంతం సమస్యలు లేదా పార్టీ వ్యవహారాలలో అతడెప్పుడైనా జోక్యం పెట్టుకున్నాడా? అయినా అతడు అభ్యర్థి కాగల్గాడంటె ఏమిటి అర్హత – డబ్బు తప్ప?

ఎన్నికలలో విచ్చలవిడి ఖర్చుకు కూడా ఈ ఉపఎన్నికలు ఉదాహరణలుగా నిల్చాయి. రెండు నియోజక వర్గాలలో రెండు పార్టీల వారూ లక్షలకు లక్షలు మంచి నీళ్ల ప్రాయంగా ఖర్చు పెట్టారు. ఒక్కొక్కరు యాభై లక్షల నుంచి కోటి రూపాయల వరకు వెదజల్లారు; డబ్బుతో కొనడానికి తాము గొర్రెలము, బర్రెలము కామని మన రాష్ట్రంలో ప్రజలు పలుమార్లు నిరూపించారు. నోటు ఎవరిచ్చినా ఓటు మాత్రం తమకు నచ్చిన వారికే వేస్తామని రుజువు చేశారు. ఎన్నోగుణపాఠాల తర్వాత కూడా అభ్యర్థులు ఇంకా డబ్బుతో గెలవడానికి ప్రయత్నం చేస్తున్నారంటె ఏమనుకోవాలి? ఆఖరుకు సిపిఎం పార్టీ కూడా ఈ ప్రవాహంలో పడిపోయి కాంగ్రెస్, తెలుగుదేశంతో పోటీ పడి ఖర్చు పెట్టిందంటె, రంగుల వాల్ పోస్టర్లు, పదుల సంఖ్యలో కార్లు వాడిందంటె రాజకీయ వాతావరణం ఎంతగా కలుషితమై పోయిందనుకోవాలి? అసెంబ్లీ ఎన్నికకే ఇంత ఖర్చు అయితే సాధారణ రాజకీయ వాది పరిస్థితి ఏమిటి? సామాన్యులు ఎన్నికల పేరును కలలో నైనా తలవగలరా? ఈ పెట్టె డబ్బంతా తిరిగి వచ్చేదెట్లా? ప్రజలను ఏదో ఒక రూపంలో దోచుకోకుండా గెల్చే అభ్యర్థులు వుండగలరా?

రాజకీయాలలో మితిమీరుతున్న అవినీతికి ఈ విశృంఖల ప్రచార వ్యయమూ ఒక కారణం. రాజకీయ పార్టీలు తమ తప్పును గ్రహించి, ఇప్పటికైనా దారితప్పుతున్న ఎన్నికల తీరును సక్రమ మార్గంలో పెట్టాలి. కేవలం డబ్బుతో ప్రజలను మాయ చేయగలమన్న భ్రమ వదిలించుకొని, టిక్కెట్ల పంపకానికి సేవ, ప్రజాసాన్నిహిత్యం వంటి అంశాలను పరిగణనకు తీసుకోవాలి, ఎన్నికల ఖర్చు తగ్గించాలి. లేకుంటే ప్రజల నుంచి చాలా దిగ్గా గుణపాఠాలు నేర్చుకోవలసి వస్తుంది.

## జమీన్‌రైతు

21.5.43

4 పేజీలు అణా:

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

**కాలేజి పరీక్షా ఫలితాలు:**

| | గత సం. | ఈ సం. |
|---|---|---|
| మొత్తం ఇంటర్ విద్యార్థుల సంఖ్య | 170 | 177 |
| పరీక్షకు హాజరు కాని వారు, పరీక్షకు పంపని వారు | 17 | 24 |
| పరీక్షకు పోయిన వారు | 153 | 153 |
| ఇందులో 3 భాగాల్లో పూర్తిగా పరీక్ష ఐన వారు | 69 | 58 |
| ఇందులో ప్రథమ తరగతిలో ఉత్తీర్ణులైన వారు | 14 | 16 |

గత సంవత్సరం కంటె డిటెన్షన్ జాస్తి, ఫలితాలు తక్కువ

**బాలికలు**

| | గత సం. | ఈ సం. |
|---|---|---|
| పరీక్షకు పోయిన వారు | 4 | 8 |
| పూర్తి పరీక్ష అయిన వారు | 3 | 2 |
| పార్టులుగా పరీక్ష ఐన వారు | | 6 |

పూర్తిగా ప్యాసు గాని వారు ఈ సంవత్సరం లేరు. బాలికలు గత సంవత్సరమే "బుద్ధిశ్చాపిచతుర్గుణః" అనిపించారు.

### హెడ్మాస్టరెవరు?

ఈ విషయం అందరి హృదయాంతరాళాల్లో తరంగితమౌతున్న ముఖ్యప్రశ్న. ఐదికూతమైన ఆ తిప్పరాజువారి గీత వ్రాసినట్లు వ్యక్త్యభిమానాలు, వ్యక్తిద్వేషాలు గాదు మనకు కావలసింది: వేలకొలది విజ్ఞానఖనుల సృష్టించవలసిన సరస్వతీ దేవాలయార్చకాన్వేషణము. యిందు సర్వభేదాలు, తన – మన, అంతరాలకు చోటు లేదు. తాను తరించి, విద్యార్థుల• తరింప జేయగల తేజోరాశి కావాలె.

శ్రీ రామయ్యం గారి పేరొకటి సూచింపబడుచున్నది. వీరు దీనికెంతేని అర్హులే. కాని అన్న ప్రిన్సిపాల్, తమ్ముడు హెడ్మాస్టరు అయితే అధికార దుర్వినియోగం జరుగుతుందా అనే ఒక్క ఆక్షేపణే ఆలోచనీయాంశం. అది తప్పితే మంచి సెలక్షన్. ఐనా ఆలోచిం చండబ్బా!

- విమర్శకుడు

### గ్రామసీమలు

**అల్లూరు పేట**

రైటింగు వగైరా కాలేజి ప్రిన్సిపాళ్ల తగాదాల వల్ల అందు చదువు పిల్లలు యమయాతన పడుతున్నారు స్వామీ!

– పౌరుడు

**ఇందుకూరు పేట**

పాత విద్యార్థి సంఘము 1 తేది స్థాపించిరి. అధ్యక్షులు యర్రంరెడ్డి రంగారెడ్డి, ఉపాధ్యక్షుడు మామిడాల వెంకయ్య, కార్యదర్శిగా ముప్పిరాల వెంకట సుబ్రమణ్యం గారలను ఎన్నుకొనిరి.

– ఒ.వి.

**బాలిరెడ్డిపాళెం కిర్సనాయిలు**

ఈ ప్రాంతంలో కిర్సనాయిల్ కరువు విపరీతంగా వుంది. కోట, వాకాడు గ్రామాలకు సప్లయి ఇచ్చినారు. అక్కడ పోతే వారు చేతులు వెల్లికిల వేస్తున్నారు. తాలూకా ప్రభువు నడిగితే పైకి వ్రాశాను వస్తుందంటాడు. బీదబిక్కి కూటికే గాక తిల్లిక చమురుకు గూడ ఏడవలసిందేనా?

**నారాయణవరపు లంచము**

కోవూరు తాలూకా దామవరం మజరా నారాయణ పురం భూములు సుక్తిపోయినవి. శిస్తు మజరా యిచ్చారు. పేషార్కు దొర సన్న రైతులను చమకాయించి కొంత వసూలు చేశాడు. శోత్రియందారు విచారించి యీ పేదల డబ్బు వాపస్ యిప్పించమనీ, బకాయి డిక్రీలు వాయిదా వేయించమని ప్రార్థన.

–బలరామయ్య

## చట్టాలతో ఏ మేలూ జరగదు!

రాష్ట్రంలో అన్ని రాజకీయ పార్టీలు ఏకమై, సారా వ్యతిరేకోద్యమాన్ని సమర్థవంతంగా నడిపి మద్యపాన నిషేధ చట్టం చేయించడంలో విజయం సాధించాయి. అయితే ఇల్లు అలకగానే పండగౌతుందా? వరకట్నాన్ని నిషేధిస్తూ చట్టం వచ్చినా వరకట్నాలు ఆగాయా? జంతు బలి నిషేధింప బడినా జాతర్లలో జంతు బలులాగాయా? చట్టాలతోనె పూర్తి మేలు జరుగదు. రెట్టించిన వుత్సాహంతో మద్యపాన నిషేధ చట్టం అమలుకు సారా వ్యతిరేకోద్యమ కారులందరూ పునరంకితం కావాలి. అపుడే సారా బాధితుల బ్రతుకుల్లో నిజమైన సంక్రాంతి. లేకుంటే చరిత్రాత్మకమైన వుద్యమం నీరుగారి పోతుంది.

గూడూరు – పి.వి. ప్రభాకర రావు

### రచయితలారా ఆలోచించండి!

తెలుగు సినిమా రచయితల సమాఖ్య ఒకటి ఏర్పడ బోతున్నదని పది రోజుల క్రిందట పత్రికల్లో వెలువడ్డ ప్రకటన చూచి ఎంతగానో ఆనంద పడ్డాను. సమస్యల సాధనకు సంఘాలు అవసరమే. కాని కళారంగంలో విస్తృతంగా పనిచేసిన ఒక కళాకారులుగా సినీ రచయితలు తాము సమాజానికి వుపయోగ పడే రచనలు చేస్తున్నామా అని ఒక సారి సింహావలోకనం చేసుకొని వుంటె బాగుండేదని నా అభిప్రాయం.

నిత్యం లక్షలాది మందిని ప్రభావితం చేసి కీలక పాత్ర వహిస్తున్న సినిమాల్లోని పాట, భావం, భాష్యం ఏ దారి పట్టి వున్నాయో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. నేటి సినిమాల్లోని భావనలు సమాజానికి మేలు చేయలేక పోయినా క్రైం, సెక్స్, టెర్రరిజం, దొంగతనాలు, దోపిడీలు చేయడానికి నైపుణ్యాన్ని బోధిస్తున్నాయి. భావి భారత సమాజ భవిష్యత్తుని నాశనం చేస్తున్నాయి. ఈ విషయమై సమాఖ్య సమావేశంలో ఎవరూ ఒక్క మాట కూడా మాట్లాడలేదు. డబ్బే ప్రధానం కాకుండా సమాజాన్ని కూడా గుర్తు పెట్టుకొని రచనలు చేస్తారని ఆశ.

నెల్లూరు – వున్నం బసవయ్య

### జనవాణి

### హర్షణీయం

అధికార భాషా సంఘం అధ్యక్షుడుగా శ్రీ గజ్జెల మల్లారెడ్డిని ప్రభుత్వం నియమించడం హర్షణీయం. గతంలో విశాలాంధ్ర, ఈనాడు, ప్రస్తుతం ఉదయం ఎడిటర్‌గా సమకాలీన పరిస్థితులను క్షుణ్ణంగా అరటి పండు వలచి నోట్లో పెట్టినట్లు ప్రజలకు చెప్పగల మేధావి, గొప్ప వక్త, 'శంఖారావం' 'మల్లారెడ్డి మాట కచ్చేరి' 'అక్షింతలు' శీర్షికలతో ప్రజల నాలుకల పై నిత్యం వుండే వ్యక్తి మల్లారెడ్డి. గత సంవత్సరం 'జమీన్‌రైతు' వ్యవస్థాపకులు స్వర్గీయ రామానాయుడు అవార్డు విజేత కూడా అయిన మల్లారెడ్డిని ఈ పదవికి ఎంపిక చేయడం సముచితం.

నెల్లూరు – జె.పోలిరెడ్డి

కొరవ 10 పేజీలో

అభినందనలు

మిత్రులు, ఆప్తులు

శ్రీ ఆనం వివేకానంద రెడ్డి గారు

వి.ఆర్. కళాశాల కరస్పాండెంట్ మరియు కార్యదర్శిగా ఎన్నికయిన శుభసందర్భంలో మా హృదయ పూర్వక శుభాభినందనలు

పి. పట్టాభిరామిరెడ్డి
బాలాజీనగర్, నెల్లూరు

# కంచి పరమాచార్యులు

తపస్సంపన్నుడు

పరమపవిత్రుడు

తేజోమూర్తి

దైవసముడు

శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు, జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామి వారు ఈ మే 7 తేది 99 సంవత్సరములు పూర్తి చేసికొని నూరవ ఏట ప్రవేశించారు.

జీవన్ముక్తునికి సమకాలీను లమైనందుకు మనం గర్వపడవలసిందే. ఆ అదృష్టం కలిగి నందుకు పొంగి పోవలసినదే. పూర్వాశ్రమంలో వీరి పేరు "శతమానంభవతి" అని ఏ ఋషితుల్యులు వారిని ఆశీర్వదించారో గాని లోకాన్ని తన శాంత స్వరూపంతో, ఆనంద పరవశంతో అలరింప జేసే ఒక

"స్వామినాథన్" 20.5.1894 తేది వైశాఖ బహుళ పాడ్యమి ఆదివారం అనూరాధ నక్షత్రంలో దక్షిణ ఆర్కాట్ జిల్లాలో విల్లుపురం పట్టణంలో శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రి - మహాలక్ష్మమ్మ లకు ద్వితీయ పుత్రుడుగా జన్మించినారు. వారి కులదైవం స్వామిమలైలోని స్వామినాథుడే.

1906 లో నాల్గవ ఫారం చదువుతున్న స్వామినాథన్ తల్లి దండ్రులతో కలసి కామకోటి పీఠం 66వ ఆచార్యులు శ్రీ చంద్రశేఖర సరస్వతిని దర్శించారు. ఆ అబ్బాయిని చూడగానే వారికి తన తరువాత మఠాధిపతిగా

## నూరేళ్ల స్వామికి నిండు నమస్సులు

చేసికొనవలెనని ఆలోచన కలిగింది. కొద్ది నెలల తరువాత 66వ ఆచార్యులు సిద్ధి పొందారు. కాని స్వామినాథన్ గారి పెద్ద తల్లి కుమారుడు మహాదేవ సరస్వతి అనే పేరుతో మఠాధిపతి అయ్యారు. ఆయన వారం రోజులలోనే సన్నిపాత జ్వరంతో పరమపదించారు. వారి కోరిక పై 13 ఫిబ్రవరి 1907లో స్వామినాథన్

"చంద్రశేఖరేంద్ర సరస్వతి" అనే దీక్షానామ నామధేయంతో కామకోటి పీఠానికి 68వ ఆచార్యులుగా అభిషిక్తులైనారు.

"కయితి బ్రహ్మణోనామ తేన త్రాంబితో హరిః తస్మాత్ కాంచిత విఖ్యాత పురీ పుణ్యవివర్ధినీ" అని కాంచీపురం ప్రసిద్ధి చెందినది. అట్టి కంచిలో ఆదిశంకరుల వారు స్వయంగా శ్రీ చక్రాన్ని ప్రతిష్ఠించారు. శంకర భగవత్పాదుల వారు నెలకొల్పిన పీఠాల

పరుసలోనికి ఈ పీఠం వస్తుందా రాదా అనేది అసంగతము, అప్రస్తుతం. ఎనిమిది దశాబ్దాలకు పైగా ఈ పీఠం ఎంతో ప్రాశస్త్యం వహించి గుర్తింపు పొందినదంటే అది పరమాచార్యుల వారి విశిష్టతే.

పరమాచార్యుల వారు బహుముఖ ప్రజ్ఞాధురీణులు. వారి విద్వత్తు అద్భుతం. ఆయనకు గల సునిశిత ఆధ్యాత్మిక దృష్టి 17 భాషలలో గల పాండిత్యము, తపస్సంపన్నత, ఇతరుల కష్టాలను తొలగించాలనే ఔదార్యం, మహ

కరవ 10 పేజీలో



# ఆక్రమించేటప్పుడు నిద్రపోయి ఆ తర్వాత ఆగం చేస్తే రోడ్లు విశాలమౌతాయా?

టవున్‌లో దురాక్రమణల సమస్య

నెల్లూరు టౌన్ ట్రాఫిక్ సమస్య గురించి ఆవేదన చెందని వాడుతే వుండరు. రోడ్ల మీద రికామీగా నడిచిపోయే సాధారణ పాదచారుల నుంచి, మేధావులనదగిన ఇంజనీర్లు, టౌన్ ప్లానర్లు వగైరా వృత్తి నిపుణుల వరకు

ప్రతి ఒక్కరిలోనూ ట్రాఫిక్ బాధల ఆవేదన వ్యక్తమౌతునే వుంటుంది. ఏ ఆవాహన, చింతన వుండనిది ఒక్క మునిసిపల్ అధికారులకే! ఆ రోజు కలెక్షన్ పై ధ్యాస తప్ప, ప్లానింగ్ పై మనసే వెళ్లదు వారికి! అందువల్లే నెల్లూరు రాను రాను ఒక

ట్రాఫిక్ పద్మవ్యూహం మాదిరి తయారౌతున్నది; నెల్లూరు రోడ్లు హైదరాబాదు పాత బస్తీని మరిపించే విధంగా మారిపోతున్నాయి. మునిసిపాలిటీతో, టౌన్‌తో యాభై ఏళ్లకు పైన అనుబంధం కల్గిన, ప్రతిభావంతుడైన ఇంజనీరు, టౌన్ ప్లానింగ్‌లో నిష్ణాతుడు శ్రీ తిక్కవరపు కోదండ రామిరెడ్డి ఒక సుదీర్ఘవ్యాసంలో టౌన్ సమస్యల పట్ల తన ఆవేదన వ్యక్తపరిచారు. దాన్ని సంక్షిప్తంగా ఇస్తున్నాము - చదవండి!

మన నాయకులు దేశాన్ని 21 శతాబ్దంలోకి దూకిస్తున్నామని ప్రగల్భాలు పల్కుతుంటారు. వారు దూకించక పోయినా, ప్రాక్కుంటూ అయినా దేశం ఆ గమ్యం చేరక తప్పదు. అయితే 21 శతాబ్దంలోకి దేశం నడవాలంటే మన పల్లెలు, పట్టణాలలో కొన్ని మౌలికమైన మార్పులు రావాలి. కాని మన మునిసిపాలిటీలు, వాటి అధికారులలో ఆ అవగాహన, ఆలోచనే కల్గడం లేదు. టౌన్ ప్లానింగ్ సిద్ధాంతాంలో "జనసాంద్రత" అనేది గమనించాల్సిన విషయం. అంటే ఒక ఎకరా ప్రదేశంలో ఎన్ని ఇళ్లు, అంగళ్లు, ఇతర కట్టడాలు వుండాలి, వాటిలో నుంచి జనం రాక పోకలు సాగించడానికి రోడ్లు ఎంత వెడల్పు వుండాలి, జాగా కావాలి అని అంశాల పై అంచనాలున్నాయి. వివిధ అంతస్తులు కలిపి, ఎంత స్థలంలో ఎంత కట్టుబడి వుండాలని నిర్ణయించే విధానం ఫ్లోర్ స్పేస్ ఇండెక్స్ కూడా టౌన్ ప్లానింగ్‌కు ముఖ్యమైనది. మునిసిపల్ అధికారులు, రెండు రిక్షాలు ఎదురెదురుగా వెళ్లలేని ఇరుకు సందులలో కూడా, ఎటు చూసినా అంగుళం ఖాళీ వదలక [illegible]

మూడు, నాలుగు అంతస్తుల భవనాలు కడుతుంటే కళ్లు మూసుకొని [illegible] వర్ధిల్లేస్తున్నారు. పర్మిషన్ లేకుండా కట్టే భవనాలనూ అడ్డు పెట్టడం లేదు. ఆ భవనాలలోని జనం బయట తిరగాలంటే రోడ్డు వైశాల్యం ఎక్కడ వుంటుంది? ఎక్కడ నుంచి వస్తుంది?

పాత బిల్డింగులు పగులగొట్టి, కొత్తవి కట్టేటప్పుడు మునిసిపాలిటీ రోడ్డు వెడల్పు కోసం స్థలం స్వాధీనం చేసుకోవచ్చు. అయితే పబ్లిక్ వీధులనే ఆక్రమించుకొని అంతస్తుల మీద అంతస్తులు లేపేస్తుంటే అడిగే వారే కన్పించడం లేదు. సాక్షాత్తు మునిసిపాలిటీయే తమిళనాడు వ్యాపారస్తులకు కో ఆపరేటివ్ బ్యాంక్ ప్రక్కన వుండే రోడ్డును పంచిపెట్టింది. వారికి సహాయం చేయాలంటే, రోడ్డును పంపకం చేయడం తప్ప వేరే మార్గం కన్పించదం

లేదు వారికి! ఒక వైపు ఆక్రమణలు, ఇంకొక వైపు పందారాలు జరిగిపోతున్నా నిద్ర నటించే మునిసిపాలిటీ ఆ తర్వాత ఆక్రమణల తొలగింపు పేరుతో ఆగం చేస్తే రోడ్లు విశాలమౌతాయా?

ట్రంకురోడ్డుకు పడమరగా రాయాజీవీధి, ఆవారి వీధులు; తూర్పుగా

**సింహపురి**

కో ఆపరేటివ్ బ్యాంకు వెనుక వీధి, రైలు కట్ట క్రింది వీధి వెడల్పు చేసి, అభివృద్ధి పరిస్తే ట్రంకురోడ్డు పైన ట్రాఫిక్ రద్దీ తగ్గుతుంది. కాని పెద్దపోస్టాఫీసు నుంచి కాపువీధి మొగుదల వరకు ఆవారి వీధిలో రోడ్డును ఆక్రమించి పలు అంతస్తుల భవనాలు కట్టేస్తుంటే పట్టించుకోవడం

కరవ 11 పేజీలో


## N.B.K.R. CAMPUS SCHOOL

VIDYANAGAR - 524 413 :: NELLORE Dt. (A.P)

Applications on plain paer, giving full details of qualifications, experience and expected salary, for the following posts, should reach the undersigned on or before **5.6.1993**

A. Trained Graduate Teachers in
   1) Englsih 2) Social Studies
   3) Mathematics 4) Physical Sciences
   5) Natural Sciences

B. Kindergarten Teachers.

C. Fine Arts and Physical Education

D. Typist.

Salary will be in commensurate with Qualification and Experience. Those who can teach in English need only Apply. Retired Persons, if found suitable, can also be considered for appointment.

Vidyanagar
15.5.1993

**M.S. Reddy**
Correspondent

జెంట్స్ రెడీమేడ్స్

షర్ట్స్ | ట్రౌజర్స్ | జీన్స్

*Dunhill* | *Kinger* | టి. షర్ట్స్

*Sero* | *Stuff* | కుర్తా సెట్స్

*City*

విమల్ జంక్షన్

కాపువీధి : నెల్లూరు

# కోవూరు ఎన్నికలో చిత్ర విచిత్రాలెన్నో...!

పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారికి కాంగ్రెస్ అభ్యర్థిత్వం ఎట్లా లభించింది? ప్రధాని పి.వి. ఆయన మీద దుర్గాదా? సి.ఎం. విజయభాస్కర రెడ్డి పట్టుదలతో వచ్చిందా? అసలు నిమిషంలో ఆయనే కోరి తెచ్చుకున్నారా? తెర వెనుక భాగోతాలు బయటి వారికి తెలిసే అవకాశం లేదు.

ప్లాట్‌ఫారాల మీద పెళ్లకూరు - "ఐదు ఓట్లు వచ్చినా పరవాలేదు నువ్వే పోటీ చేయాలి అని పంతులు గారు నన్ను ఆదేశించారు. ఆయన మాటను కాదనలేక పోయాను" అని ప్రకటించుకున్నారు. ప్రధాని మాటను శిరసావహించారు; కాంగ్రెస్ వాదులందరి శిరస్సులనూ ఓటమి కిరీటంతో అలంకరించారు!

* * *

గెలుపు ఓటముల కీర్తి అపకీర్తులు, ప్రతిష్టాప్రతిష్టలు పెళ్లకూరును అంటవు. విజయమైనా అపజయమైనా వాటిని రామచంద్రారెడ్డి గారు ప్రధాని - ముఖ్యమంత్రి - మాగుంట లకు సమర్పయామి అనబోతాను. అభ్యర్థి నేను కాదు అని చెప్పుకున్నప్పుడు ఫలితం కూడా తనది కాదు గదా!

* * *

18 తేది రాత్రి పివిన పెనుగాలి రాజమార్గంగా వీవి, అందరినీ పలుకరించి పోయింది గాని; తెలుగుదేశం గాలి దొంగ వలె చడీచప్పుడు కాకుండా దొడ్డిదారిన వచ్చి శేషన్ వాటున ఓట్లు దొంగలించుకొని పోయినట్లుంది!

* * *

అయోధ్య లాభం బి.జె.పి.కి ఎంత వరకు వుపకరించిందో అనుమానమే గాని, కాంగ్రెస్‌ను మాత్రం పడగొట్టింది. నియోజక వర్గంలోని ముస్లిం ఓట్లలో అత్యధిక భాగం కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా పడ్డాయని వదంతి!

* * *

పెళ్లకూరు ప్రభాకర రెడ్డి తెలుగుదేశం అభ్యర్థిత్వానికి ఒక వుభయ మిత్రుని ద్వారా ఒక కాంగ్రెస్ ముఖ్యుడు గట్టి ప్రయత్నమే చేశాడని. ఆ ప్రయత్నం సఫలమై వుంటే రామచంద్రారెడ్డి గారు కాంగ్రెస్ అభ్యర్థి అయివుండే వారా అని ఒకరి గొంటె ప్రశ్న. రాజకీయాలలో తండ్రీ తనయులు, అన్నదమ్ములు, భార్యభర్తలు భిన్న పార్టీ అభ్యర్థులుగా పోటీచేసుకున్న సాదృశ్యాలు లేవా?

* * *

దేశం కోసం ప్రాణాలర్పించిన ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ బొమ్మలే కాదు, వారి పేర్లు కూడా ఎన్నికల ప్రచారంలో వినబడలేదని. చచ్చి స్వర్గాన వున్న వారితో ప్రయోజనమేమి

కొరవ 7 పేజీలో

## జిల్లా వార్తలు

### సూళ్లూరుపేట రిజిష్టాఫీసు అవినీతి కంపు

సూళ్లూరుపేట సబ్ రిజిష్ట్రార్ ఆఫీసు అవినీతి కుళ్లు కంపుతో జనం ముక్కు దులాలు బద్దలు చేస్తున్నది. ఆఫీసు లోపలకి అడుగుపెడితే చాలు - శవాల పై వాలే రాబందుల్లాగా మట్టు ముట్టేస్తారు ఉద్యోగులు. రిజిష్ట్రార్ ఆఫీసులో ఎక్కడ వుంటే, అవినీతి దేవత అక్కడల్లా తిష్టవేసి దేదీప్య మానంగా ప్రకాశించడం సహజమే కాని, సూళ్లూరుపేటలో మాత్రం ఆ మహాతల్లి ప్రతాపం వర్ణింప తరం కాదు. ప్రతి ఉద్యోగి, అధికారి నరనరంలో లంచాల జాడ్యం జీర్ణించుకొని పోయి వుంది. రిజిష్ట్రేషన్‌కు ప్రభుత్వ రుసుము ఎంతో, లంచం మొత్తమూ అంతే చెల్లిస్తే తప్ప కాగితాలు కదలటం లేదు. ఎవరైనా అన్యాయమని ఘోషించారో - వారి పని క్లోజ్. వారి ఇంటి స్థలం, లేదా పొలం రిజిష్టర్ చేయడం బ్రహ్మతరం కూడా కాదు. యక్ష ప్రశ్నల వేసి, సవాలక్ష అభ్యంతరాలు చెప్పి, మహాప్రభో మా కప్పం మీరు స్వీకరించండి అని మొరపెట్టుకునే వరకు పీడించేస్తున్నారు. లంచం చెల్లిస్తే మార్కెట్ వాల్యూలు మారి పోతాయి; ఇసిలు క్షణాల్లో వచ్చేస్తాయి; నకళ్లు పరుగు పరుగున చేతికందుతాయి.

ఉన్నతాధి కారులెవరైనా ఈ అవినీతి కంపు బారి నుంచి సూళ్లూరు పేట ప్రజలను రక్షించ కూడదా?

### "మా పతనానికి ప్రభుత్వమే కారణం"

కావలి జవహర్ భారతి కళాశాలలో దినదినానికి పతనమై పోతున్న ప్రమాణాలకు ప్రభుత్వ విధానాలే కారణమని రెక్టార్ శ్రీ డి. రామచంద్రా రెడ్డి గారు ఆరోపిస్తున్నారు. కళాశాల స్థాపన సమయంలో తాము ఆశించిన ఆదర్శాలు నానాటికీ మరగున పడి పోతున్న మాట నిజమే; క్రమ శిక్షణా రాహిత్యం పెరిగి పోతున్న మాట నిజమే; ధనాశతో కోచింగ్ సెంటర్లు మరిగి విధి నిర్వహణ పట్ల అధ్యాపకులు అశ్రద్ధ చూపుతున్న మాట వాస్తవమే. కాని ప్రభుత్వ విధానాల వల్ల క్లాసుల్లో విద్యార్థుల సంఖ్య పెరిగి పోయి హాజరు వేయడానికి, సిలబస్ పూర్తి చేయడానికి, పరీక్షలు నిర్వహించడానికి వీలుకాక క్రమశిక్షణ తప్పి పోతున్నదని; అధ్యాపకుల పై చర్య తీసుకోలేక, వారి అరాచక చర్యలు అరికట్టలేక పాలక వర్గం సతమతమై పోతున్నదని ఆవేదన పడ్డారాయన. ఏప్రెల్ 29 తేది కాలేజిలో కాపీలు కొడుతున్న విద్యార్థిని పట్టుకొన్నందుకు ఒక లెక్చరర్‌కు దేహశుద్ధి చేసిన దుర్ఘటన పై పాలకవర్గం ఒక సమావేశం ఏర్పాటు చేసింది.

ఆవేదనలు, నిందారోపణలతో కాలేజి చక్కబడదు; పాతికేళ్ల నాటి స్ఫూర్తిని పాలకవర్గం ఇప్పుడు అవహింప జేసుకో గల్గితే తప్ప పరిస్థితి దారికి రాదు.

### నిప్పో నీటి దానం

తడలో నీటి కరువుతో అల్లాడిపోతున్న జనానికి దాహం తీర్చను నిప్పో అధినేత శ్రీ పి. ఓబుల రెడ్డి ట్యాంకర్ల ద్వారా నీరు సరఫరా చేస్తున్నారు. 13 తేది నుంచి ఒక ట్యాంకర్ నీటి సరఫరా ప్రారంభించింది. అవసరమైతే ట్యాంకర్ల సంఖ్య పెంచడానికి ఓబుల రెడ్డి గారు సిద్ధమే!

ఈ వేసవిలో నీటి దానాన్ని మించిన దేముంది? ఓబులరెడ్డి గారికి జనం జేజేలు చెప్తున్నారు.

### సర్వేపల్లిలో నీటికి కట కట

కాంట్రాక్టర్ అవినీతికి అధికార్ల

కొరవ 8 పేజీలో

*ONE AND THE ONLY ASTROLOGER WHO FOLLOWS WHAT HE PRACTICES; FIRST TIME IN YOURNELLORE.*

*WORLD FAMOUS ASTROLOGER FOR THE PAST TWENTY THREE YEARS.*

SWAMI R. RAMAKRISHNA SARATHY,

ASTRO-PALMIST

ASHOK HOTEL, NEW DELHI

Any Problems – Business ☐ Marriage ☐ Health Etc.

He Solves it for you. He will be at NELLORE on 29th and 30th May '93.

29.5.93 TWO DAYS ONLY 30.5.93

CONTACT ☎ : 27041 to 27049

Venue: HOTEL SIMPHAPURI, NELLORE

# నెల్లూరు నలుచెరగుల్లో
## విహార్యకుడు

### రామానాయుడు జయంతి

'జమీన్‌రైతు' జనకుడు నెల్లూరు స్వర్గీయ వెంకట్రామా నాయుడు గారి జయంతిసభ జూన్ 3 తేది సాయంత్రం నిప్పో ఎదురుగా వున్న జమీన్‌రైతు కార్యాలయ ప్రాంగణంలో జరుగుతుంది. ప్రఖ్యాత రచయిత్రి, ప్రమదావనం శీర్షికతో ప్రతి తెలుగు మహిళకూ పరిచితురాలైన శ్రీమతి మాలతీ చందూర్ రామానాయుడు గారి అవార్డు స్వీకరిస్తారు. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు రామానాయుడు విగ్రహావిష్కరణ చేస్తారు. రాష్ట్ర సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య, స్టేట్ ఫైనాన్స్ కార్పొరేషన్ ఛైర్మన్, ఆత్మకూరు ఎమ్మెల్యే డాక్టర్ బి. సుందర రామరెడ్డి ముఖ్య అతిథులుగా పాల్గొంటారు.

జమీన్‌రైతు పాఠకులు, మాలతీ చందూర్ అభిమానులు తప్పక విచ్చేయాలని మా హృదయ పూర్వక ఆహ్వానం.

### ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి 15 తేది ఉదయం నెల్లూరు వచ్చి, కోవూరు ప్రచార సభలో పాల్గొని 16 తేది ఉదయం తిరిగి వెళ్లారు.

### ఈదురు గాలి

ఈ వారంలో ఉష్ణోగ్రత బాగా తగ్గింది. వాన పడలేదు గాని వాతావరణం మాత్రం చల్లబడి పోయింది. రాత్రుళ్లు చల్లటి ఈదురు గాలులు తోలుతున్నాయి. 18, 19 తేదులలో అర్ధరాత్రి తర్వాత గంటకు పైగా ఇళ్ల కప్పులు లేచి పోయేంత ఉధృతంగా గాలులు వీచాయి. మామిడి తోటలకు తీవ్ర నష్టం. చాలా చోట్ల కరెంట్ స్తంభాలు పడిపోయాయి.

చల్లబడటం తప్ప, చినుకులు లేక పోవడంతో నీటి కరువు మాత్రం తీరడం లేదు. బావుల్లో నీటిమట్టం పెరగలేదు.

### సిఎంకెకు గౌరవ పదవి

నెల్లూరీయుడు, మద్రాసులో పేరున్న సర్జను, వైద్య విద్యా రంగంలో నిష్ణాతుడు డాక్టర్ సిఎంకె రెడ్డి, మద్రాసులోని ఎంజిఆర్ మెడికల్ యూనివర్సిటీ గవర్నింగ్ కౌన్సిల్ సభ్యుడుగా ఎన్నికైనారు. గవర్నింగ్ కౌన్సిల్ అంటే విశ్వవిద్యాలయం పరిపాలనా, విద్యా విధానాలు రూపకల్పన చేసే అత్యున్నత సంస్థ. తమిళనాడు నుంచి నలుగురు సభ్యులు ఎన్నికైతే ఒక్క సిఎంకె మాత్రం

కరవ 7 పేజీలో

# తెలుగుదేశం సుడిగాలిలో కాంగ్రెస్ గడ్డిపోచ అయిపోయింది!

అనుకున్నంతా అయింది; కాంగ్రెస్ కొంప మునిగి పోయింది. తెలుగుదేశం సుడిగాలిలో కాంగ్రెస్ గడ్డి పోచ వలె కొట్టుక పోయింది. కోవూరులో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి అత్యంత అవమానకర తీరులో పరాజయం ఎదుర్కొంటున్నారు. ఈ వార్త వ్రాసే సమయానికి (21 తేది సాయంత్రం 6 గంటలు) తెలుగుదేశం అభ్యర్థి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్నకుమార రెడ్డి 17 వేల ఓట్ల తిరుగులేని ఆధిక్యతతో విజయపథం వైపు దూసుకు పోతున్నారు!

మేము గతవారమే వ్రాశాము - "నిజం మాట్లాడ వలసి వస్తె తెలుగుదేశమే ఒక వీసం అధికంగా వున్నట్లు చెప్పాలి; మాగుంట గ్లామర్‌కు, శీనయ్య సానుభూతికి మధ్య జరిగిన పోటా పోటీలో సానుభూతే ప్రజలను ఎక్కువగా ఆకర్షిస్తున్నది! ఆదరణకు నోచుకుంటున్నది" అని; ఇంకొక మాట కూడా వ్రాశాము. "ఇప్పటికైనా కలదెలుసుకొని ప్రమాదం గమనించి, ప్రతి కాంగ్రెస్ వారినీ సమైక్య పరచి, ఉమ్మడి బలం ప్రదర్శిస్తే తప్ప కాంగ్రెస్ బ్రతికి బట్ట గట్టడం కష్టం" అని! అదే నిజమైంది!

కోవూరు, విడవలూరు, సంగం అనే తేడా లేకుండా ప్రతి గ్రామంలో తెలుగుదేశం పార్టీకి అనూహిత ఆధిక్యత లభించింది. 1983 లో వలె మహిళలు మూకుమ్మడిగా తెలుగుదేశం పార్టీని వరించారు; గళ్ల మాసుకొని సైకిల్ పైన గ్రుద్దారు. అభ్యర్థిగా రామచంద్రా రెడ్డి గారి పట్ల వ్యతిరేకత, పార్టీగా కాంగ్రెస్ పట్ల అసంతృప్తి, రైతాంగంలో

**కోవూరు ఎన్నికలో దేశం ఘన విజయం**

ప్రభుత్వం పట్ల ఆగ్రహం, యువతరంలో మళ్లీ తెలుగుదేశం పట్ల మోజు, శ్రీనివాసులు రెడ్డి పట్ల సానుభూతి,



అన్నిటికీ మించి శ్రీమతి శ్రీ లక్ష్మమ్మ దీనాలాపాలు ఓటర్ల మనసులను కరిగించి వేశాయి!

తెలుగుదేశం అభ్యర్థి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్నకుమార రెడ్డి అదృష్ట జాతకుడు. చిన్న వయస్సులోనే పార్టీలు మారే అవకాశ వాదిగా, తండ్రి పదవిలో వున్నప్పుడు అవినీతి పరుడుగా ఎక్కపేరు వున్నప్పటికీ తొలి సారి ప్రయత్నంలోనే చరిత్రాత్మకమైన విజయం సాధిస్తున్నారు; నల్లపరెడ్డి కుటుంబానికి రాజకీయ పునః ప్రాభవం చేకూర్చిపెట్టారు.

ఈ ఓటమి వల్ల పార్టీగా కాంగ్రెస్ కంటే వ్యక్తిగా శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి గారికి ఎక్కువ నష్టం. పెళ్లకూరుకు ఈ ఓటమి వల్ల ధూపం తెగదు. విశ్రాంతి తీసుకోవడానికి ఈ వారంలోనే అమెరికా ప్రయాణం సంకల్పిస్తున్నారాయన.

### కడపటి వార్త

నాల్గవరౌండు లెక్కింపు పూర్తయ్యే సరికి 9 గంటలు (సాయంత్రం 9 గంటలు) తెలుగుదేశం మెజారిటీ 20 వేలకు చేరుకున్నది. ఓట్ల లెక్కింపు పూర్తయ్యే సరికి అది 30 వేలు దాటినా ఆశ్చర్యం లేదు. సిపిఎం కష్టం మీద డిపాజిట్ నిలుకో గల్గితె, బిజెపికి ఆ గౌరవం కూడా దక్కుతం లేదు.

4 వ రౌండు తర్వాత ఓట్ల వివరాలివి

| | |
|---|---|
| తెలుగుదేశం: | 30, 052 |
| కాంగ్రెస్: | 14,710 |
| సిపిఎం: | 8,952 |
| బిజెపి: | 2,513 |
| మెజారిటీ: | 15,342 |

# ప్రథమ వర్ధంతి



జననం 1925





మరణం 2-6-1992

## చక్కా సత్యనారాయణ గుప్త గారు

(స్వాతంత్ర్యసమర యోదులు, మాజీ మునిసిపల్ ఛైర్మెన్, కావలి)

మా యింటి ఇలవేల్పు, మా అభివృద్ధికి మూలకారకులు చక్కా సత్యనారాయణ గుప్త గారు పరమపదించి సంవత్సరము గడిచింది. వారు మాకు భౌతికంగా దూరమైనప్పటికీ వారి దివ్యస్మృతులు మా వెన్నంటే ఉంటాయి. వారి పవిత్రాత్మకు శాంతిని చేకూర్చాలని భగవంతుని ప్రార్థిస్తూ.

**భార్య: చక్కా వెంకటరత్నమ్మ**

కుమారులు – కోడళ్లు
CH.V. సుబ్బారావు – అమృతవల్లి
C. నరశింహం – రమాదేవి
C. గురవయ్య – వెంకటరత్నం
C. ప్రభాకర రావు – విజయలక్ష్మి
C. కేశవ గుప్త

కుమార్తెలు – అల్లుళ్లు
B. వరలక్ష్మమ్మ – B.V. సుబ్బారావు, B.Tech. ADE, APSEB
Y. లక్ష్మీకుమారి – Y. శ్రీనివాసరావు, (శ్రీనివాస అసోసియేట్స్)
Stock & Share Dealers

అన్న: చక్కా చెన్నసుబ్బయ్య & సన్స్, మరియు చక్కా చెన్నకేశవులు & బ్రదర్స్, కావలి



ఒంగోలు శ్రీ వేపల వెంకటమ్మ కుమార్తె సుభాషిణి, సంజీవ్; ప్రైవాహనంగా అలంకృతమైన కళాక్షేత్రం

## కోవూరు చిత్రాలు

5 పేజీ తరువాయి

అనుకున్నారా అని ఒక కాంగ్రెస్ అభిమాని ప్రశ్న.

పోరుపాటు – అధునిక కోవూరు టౌన్‌లో రాజీవ్ కటౌట్లు కూడా తక్కువ వారి విధనన చెప్పుకున్నారు. పత్రికలలో వెలువడిన అర్జునుడి సెంటర్లో ఇందిర బొమ్మ, రాజీవ్ బొమ్మలు వేశారు. ఆ కాంగ్రెస్ వారు వాటిని చూసినట్లు లేదు.

* * *

15 తేది ముఖ్యమంత్రి విజయభాస్కర రెడ్డి సోమశిల గెస్ట్‌హౌస్ చేరుకున్నప్పుడు ఆయనతో బాటు కల్లకపటం, గర్వం గిర్వం ఏమీ లేని మాజీ మాగుంట సుబ్బరామరెడ్డి గారికి కూడా జిందాబాద్‌లు ప్రతిధ్వనించాయి. అంత వరకు బాగానే వుంది – మాదాసు గంగాధరం గారికి కూడా జిందాబాద్‌లు పలకడమేమిటి అని ఒక వెర్రి వెంగళప్ప ప్రకటిస్తున్నాడు. పూలతో బాటు నార పీచుకృతంలో అబ్బురమేముంది!

* * *

బాతుల వారీగా కాకుండా, అన్ని బాతుల ఓట్లు కలిపి లెక్కపెట్టడం వల్ల దొంగలందరూ దొరలయ్యే అవకాశం దొరికిందని, కోవూరులో ఈ పద్ధతి కాంగ్రెస్ కాదు ఇతర ప్రతిపక్ష పార్టీల కొంప కూడాముంచిందని ఒకరి వ్యాఖ్య. ఆ సూత్రం చట్ట బద్ధంగా దేశమంతటా అన్ని ఎన్నికలలో అనుసరించడం ప్రజాస్వామ్యానికి ఆరోగ్యకరమని ఒక అభిప్రాయం.

* * *

కాంగ్రెస్ ఎన్నికల ఏర్పాట్లు ఎంత అబందరగా వుందినాయో, తెలుగుదేశం వారి అప్రమత్తత అంత ప్రస్ఫుటంగా వుండింది. తెలుగుదేశానికి చెందిన మాజీ మంత్రులు, ఎం.ఎల్.ఏలు, అతిరథ, మహారథ పదాతి దళం వందలు వేల సంఖ్యలో బయట నుండి దిగుమతి చేయబడి, పోలింగ్ స్టేషన్లో అన్నిటికీ పంపకం గావించబడి, అత్యంత జాగరూకత వహించారు.

* * *

చంద్రబాబు నాయుడు ప్రభృతులు 18 తేది రాత్రి పూర్తి మీద పడి జాగారం చేశారట. ఎందుకై వుంటుందో ఎవరికి తోచినట్లు వారు వూహించుకోవచ్చు!

పార్టీలో నంబర్ టూ అయిన చంద్రబాబు నాయుడు చీఫ్ ఎలక్షన్ ఏజెంటుగా అతిగా వ్యవహరిస్తూంటే, కోవూరు టవున్‌లో ఆయన ఆటలు సాగనివ్వలేదట. ఒక దోస్తైతే ముట్టడించారట కూడా. తెలుగుదేశం వారు మాత్రం ఈ ఎన్నికలో చంద్రబాబు నాయుడు వ్యూహం అద్భుతం, లేకుంటే అన్యాయమై పోయివుండే వారమని సంబర పడి పోతున్నారు.

* * *

దామరమడుగు అభేద్యమైన ఎర్రకోట క్రింద లెక్క. ఓట్ల లెక్కింపు పద్ధతిలో మార్పు వల్ల ఆ కోట బీట వారవచ్చుని ఒక మాట. అక్కడ తెలుగుదేశం ఇన్‌ఛార్జి, విఖ్యాతుడైన ప్రకాశం జిల్లా ఎం.ఎల్.ఏ. కరణం బలరామ కృష్ణమూర్తి గారట!

* * *

18 తేది రాత్రి ఒక కాంగ్రెస్ కాపనసభ్యుడు పార్లపల్లిలో స్నేహిత ధర్మంగా ఒక పాత మిత్రుని యింటి మకాం చేసి, పోలింగును పర్యవేక్షించాడట. దీని వల్ల అదనంగా ఓట్లు వచ్చాయా, వచ్చేవి పోయాయా అని ఒకరు ధర్మసందేహం వెలిబుస్తున్నారు.

* * *

అధికారంలో వున్న వి.పి. ల పిలకు ఎస్.పి.జి సెక్యూరిటీ కవచం వలె, రాజకీయాలలో వుండే పెద్ద వారి చుట్టూ కూడా వాస్తవం చూడనీకుండా నిజం విననివ్వకుండా భజన పరులు వలయంగా ఏర్పడి పోతారని. కోవూరులో అదే జరిగిందని గుస గుసలు బయట వినబడ్డాయట.

* * *

భర్త పోయి మూడు నెలలు కాక ముందే ఎలక్షన్ ప్రచారానికి రావడం, వూరూరు ఇల్లిల్లు తిరగడం, వేదికలెక్కడం పూర్వపు – ప్రస్తుతపు దుస్తులు వగైరాలలో మార్పు లేకుండడం శ్రీమతి నల్లపరెడ్డి శ్రీలక్ష్మమ్మను చూచిన పల్లెటూరు పడచులకు విడ్డూరంగా, అసాధారణంగా తోచింది. కాని తాను ఏడ్చి, మహిళల చేత కంట తడి పెట్టించి, వారి సానుభూతి పొంది, తన వైధవ్యాన్ని కూడా రాజకీయ ప్రయోజనానికి వినియోగించుకొని శ్రీనివాసులు రెడ్డి గారి అర్ధాంగి అనిపించుకున్నది ఆమె. ఎవరెన్ని అనుకుంటేనేం, శ్రీనివాసులు రెడ్డి తోటి తన కుటుంబం రాజకీయంగా మరుగున పడి పోకుండా తన వంతు పాటు పడిందామె!

* * *

పట్టపు వాళ్లకు 'దురాయ్' అంటె సుగ్రీవాజ్ఞ క్రింద లెక్క. పూర్వం ఒక్కరూ ఆ కట్టు బాటుకు విరుద్ధంగా పోయే వారు కాదు. ఈ సారి దానికి కాలదోషం పట్టినట్లుంది. వాళ్ల ఓట్లు చీలిపోయాయి!

* * *

చేపూరు దేవ కుమార రెడ్డికి చెడ్డ పేరు రానే వచ్చింది – చివరన కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా చేశాడనే ఆరోపణ వినిపిస్తున్నది. కావలసినంత భవిష్యత్తు వున్న యువకులు – నిరాధారమైన ఇటువంటి అపోహలకు, ఆరోపణలకు ఆస్కారమివ్వడం మంచిది కాదు.

* * *

ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు. అభ్యర్థులు నలుగురికి తమ స్వగ్రామాలలో మెజారిటీ వస్తుందా – వినబడుతున్న ప్రశ్నలలో ఇదొకటి? తెలుగుదేశం అభ్యర్థి కోవూరుకు గెస్ట్ ఆర్టిస్టు; అందువల్ల ఆయన స్వగ్రామం ప్రసక్తి వుదయించదు. సిపిఎం అభ్యర్థికి తన గ్రామంలో మెజారిటీ గ్యారంటీ; తక్కిన ఇద్దరి సంగతి? - శేషన్ వారిని ఆ పరీక్షకు గురి చేయకుండా రక్షించాడు!


### మంచి స్థలం అమ్మకం

నెల్లూరు టౌన్ హాలుకు ఎదురుగా తిప్పరాజు వారి వీధి మొగుదుల షుమారు 62 అంకణాల మంచి ఖాళీ స్థలం అమ్మబడును. కావలసిన వారు జమీన్‌రైతు మేనేజరుతో సంప్రదించవచ్చు.

ఫోన్: 27354

### స్థలం – ఇల్లు అమ్మబడును

నెల్లూరు బృందావనంలో (F.C.I. ఎదురుగా) షుమారు 130 అం. స్థలంలో కట్టుబడి షుమారు 36 అం. మిద్దె, పెంకుటిల్లు విక్రయమునకు కలదు. వివరాలకు

**S.M. సైదా,** Advocate & A.P.P.

రేబాల వారి వీధి, స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు


# సణుగుడు

## విఆర్ కాలేజి గ్రహణం విడిచింది

విఆర్ కాలేజికి గ్రహణం విడిచింది. పదిహేనేళ్లుగా పంజరంలో చిక్కిన పావురం వలె గిలగిల లాడుతుండిన కాలేజికి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు లభించాయి. కోర్టు తీర్పుతో పాలక వర్గం మారిపోయింది. కొత్త కరస్పాండెంట్‌గా శ్రీ ఆనం వివేకానంద రెడ్డి 14 తేది ప్రమాణ స్వీకారం చేశారు. శ్రీ తూపిలి సుందర రామిరెడ్డి కొత్త అధ్యక్షుడు. శ్రీ నాగారెడ్డి శ్రీనివాసులు రెడ్డి, శ్రీ దాట్ల నరసింహారావు, శ్రీ గట్టుపల్లి సుబ్రహ్మణ్యం, శ్రీ తిరువెంగళం ఇతర సభ్యులు. ఈ కార్యవర్గ ఎన్నికలు జరిగింది 1986లో; ఏలిన నాటి శని ఏడేళ్ళున్నట్లు ఓటు వున్నమా అని ఏడేళ్ల పాటు బ్యాలెట్ పెట్టెలు పెట్టెలో దుమ్ము కొట్టుకొని పడి వుండినాయి. పాత యాజమాన్యం మారాలని, సంస్కరణలు చేయాలని ఉద్యమం ప్రారంభించి, ఎన్నికల వరకు తెచ్చిన బిజెపి "మేధావులు" ఆ తర్వాత పాత యాజమాన్యం "మచ్చిక"కు లోబడి పోయి కోర్టులో వాయిదాల మీద వాయిదాలు తీసుకొని, నెట్టగలిగినంత వరకు నెట్టి, ఓట్లు చెదలు పట్టే పరిస్థితి కల్పించారు. కాని ఎంత కాలం బిగపట్ట గలరు? పెట్టెలు విప్పి ఓట్లు లెక్కపెడితే వివేకానంద రెడ్డికి 1600, బిజెపి నాయకుడికి 6 ఓట్లు వచ్చాయి; చెల్లని ఓట్ల సంఖ్యకు సరిపడా కూడా ఓట్లు తెచ్చుకోలేక పోయిన పరిస్థితులలో ఏడేళ్ల పాటు కోర్టును అడ్డం పెట్టుకొని దోబూచు లాడడంలోనే వారి వైఖరి వెల్లడైంది.

వివేకానంద రెడ్డికి ఇదొక అద్భుత అవకాశం. రేబాల లక్ష్మీనరసా రెడ్డి గారి హయాంలో పదిహేనేళ్ళు, అంతకు క్రితం తన స్వంత తండ్రి హయాంలో పదేళ్లకు పైగా విఆర్ కాలేజి ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లు వుండిపోయింది. ఒక కొత్త కోర్సు పెట్టలేదు, ఒక కొత్త భవనం కట్ట లేదు, క్రమ శిక్షణ అన్న పదానికి విలువ ఇవ్వలేదు. అయ్యవార్లకు కాలేజి ఒక ఆట క్రింద లెక్క; పేరుగొప్ప వూరు

### దోలేంద్ర

దిబ్బ అన్నట్లు, రాజ్యాలు కోల్పోయిన రాచ కుటుంబం మాదిరి, పాడు పడిన జమీందారీ ప్యాలెస్ మాదిరి దీనంగా దయనీయంగా, దౌర్భాగ్యంగా, దిగులు దిగులుగా కన్పించే దీనత కాలం. దీన్ని చక్కదిద్దడమంటే మాటలు కాదు. ఎంతో చిత్తశుద్ధి కావాలి; ఎంతో ఓపిక కావాలి; ఎంతో ఓర్పు కావాలి; ఎంతో అవగాహన కావాలి; ఎంతో ఆలోచన కావాలి! వివేకా ఈ సవాల్‌ను స్వీకరించ గలడా? విద్యావంతులలో, మేధావి వర్గాలలో మనువు, పరువ అభిమానం పెంచుకోవడానికి లభించిన అవకాశాన్ని వాడుకోగలడా?

యాజమాన్యంలో సంకల్పం కల్గాలే గాని విఆర్ కాలేజిని ఒక మినీ విశ్వవిద్యాలయంగా తీర్చి దిద్దవచ్చు; కోస్తా జిల్లాలలోనే ప్రతిష్ఠాకరమైన విద్యా సంస్థగా అభివృద్ధి చేయవచ్చు. సమర్థతను ప్రదర్శించడానికి వివేకానంద రెడ్డికింతకు మించిన అవకాశం లభించదు.

## నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ తరువాయి)

ప్రొఫెసరు; తక్కిన వారు మెడికల్ కాలేజి డీన్లు.

తన ప్రతిభ, వాక్చాతుర్యాలతో తమిళనాట తెలుగు ప్రతిష్ఠ పెంచుతున్న సిఎంకె రెడ్డి గారికి మా అభినందనలు.

### ఒరేపల్లి మరణం

మాజీ జిల్లాపరిషత్ ఛైర్మన్ శ్రీ ఒరేపల్లి వెంకట సుబ్బయ్య మరణించారు. చాలా కాలం నుంచి



అనారోగ్యంగా వుండినారాయన. 19 తేది నెల్లూరులో తుది శ్వాస విడిచారు. ఆయన స్వగ్రామమైన నాయుడు పేట మండలం భీమవరంలో 20 తేది దహన సంస్కారాలు చేశారు.

వెంకటసుబ్బయ్య గారు మాజీ మూరుపాళ్ల కాంగ్రెస్ వాది; కాంగ్రెస్ భక్తుడన్నా అతిశయోక్తి కాదు. ఎన్ని పదవులు అనుభవించినా, ఎంత ఉన్నత స్థానంలో వున్నా ఏ మాత్రం అతిశయం భేషజం దరిచేర నివ్వని అరుదైన వ్యక్తి ఒరేపల్లి; రెండు సార్లు వెంకటగిరి ఎమ్మెల్యేగా గెల్చాడు; ఒకసారి సమితి అధ్యక్షుడుగా వుండినాడు; ఒక సారి జి.ప్ర.ప ఛైర్మన్ అయ్యాడు; చనిపోయేటప్పుడు భీమవరం సర్పంచ్. ఇంత సుదీర్ఘ కాలం పదవులను భవించిన హరిజన నాయకుడు జిల్లాలో మరొకరు లేరు; అన్ని పదవులు చవి చూచినా తినడానికి తిండి, వుండడానికి ఇల్లు కూడా మిగల్చుకోని నిజాయితీ పరుడూ ఇంకొకరు లేరు. నిజాయితీయే కాదు, నమ్మిన పార్టీకి విధేయత, చేరదీసిన నాయకుడికి విశ్వాస పాత్రత ఒరేపల్లి విశిష్ట గుణాలు.

ఒరేపల్లికి సంతానం లేదు; వయస్సు 80 సంవత్సరాలు భార్య వుంది. యాభై ఏళ్ల రాజకీయ జీవితం ఆదర్శ ప్రాయంగా గడిపిన ఆయనకు మా శ్రద్ధాంజలి.

*

**జమీన్‌రైతు**

సంవత్సరచందా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00



**ఖాళీ స్థలం అమ్మబడును**

నెల్లూరు రెంటాలవారివీధిలో అపార్ట్‌మెంట్ కట్టడానికి సౌలభ్యమైన 180 అంకణముల ఖాళీ స్థలము అమ్మబడును.
వివరములకు

కె.వి. సుబ్బారెడ్డి
25/514, పత్తేఖాన్‌పేట
నెల్లూరు. ఫోన్: 28910



**పశువుల మందులు**

అన్ని ప్రముఖ కంపెనీల పశువుల మందులు మా వద్ద లభించును

**వివేకా మెడికల్**
16/1295/3, పొగతోట - నెల్లూరు.
ఫోన్ : 27691


## గూడూరు డి.ము. మేజిస్ట్రేటు వారి కోర్టులో

O.S. No. 99/92

M/s. మైకా ఫైనాన్షియర్స్, Rep by its మేనేజింగ్ పార్ట్‌నర్
శ్రీ అల్లూరు ఆదిశేషారెడ్డి - వాది

Vs

సర్వారెడ్డి వరదారెడ్డి వగైరా - ప్రతివాది
D2 సర్వారెడ్డి నందకుమార్ రెడ్డి
D5 సర్వారెడ్డి వెంకురెడ్డి అనువారలకు

### నోటీసు

పై నంబరు దావాలో వాది ప్రోనోట్ బాకీ రాబట్టుకొనుటకు దావా చేసియున్నారు. అందుకు మీకు ఆక్షేపణలున్న 17.6.93 తేది ఉదయం 10.30 గంటలకు పై కోర్టుకు హాజరై తెలుపుకోవలయును. లేని యెడల మీ పరోక్షమందే దావా తీర్మానించబడును.

వాకాటి సుబ్బరామిరెడ్డి
వాది అడ్వొకేటు

## నెల్లూరు సబార్డినేటు జడ్జి కోర్టు

I.A. No. 716/91
O.S.No. 215/88

పి. సుగుణమ్మ – పిటీషనరు

మరియు

1. గూడూరు భాస్కర రామిరెడ్డి మరియు ఇతరులు – రెస్పాండెంట్లు
7th రెస్పాండెంటుగూడూరు సురేష్ రెడ్డి
S/o. గూడూరు సుందర రామిరెడ్డి
United India Colony,
2/6, Second Main Road
Kodambakkam, MADRAS - 24.

పై కేసును మీకు నోటీసు నిమిత్తం 26.6.93 తేది వాయిదా వేసి వున్నారు. సదరు తేదీనాడు 10.30 గంటలకు ఉదయం మీరు గాని, మీ పరోక్షముగా సమాధానము చెప్పగల వకీలు ద్వారా గాని హాజరు కాని యెడల కేసు మీ పరోక్షములో తీర్మానించబడును.

యస్. శ్రీనివాసులు రెడ్డి
పిటీషనరు/వాది అడ్వొకేటు
గాంధీనగర్, నెల్లూరు

# శివారెడ్డి పద్యాలు

### నాక లోకమేడనక్కడే

నాకలోకమేడ నక్కడ కాంగ్రెసు
అభయహస్తమేడ సైకిలేడ
కడుపు మంట కొద్ది కక్కుర్తి పడుతారు
పాడులోకం మెప్పి పాలిటిక్సు

తప్పులుండవమ్మ తండోపతండాలు
రొసగులుండవమ్మ రోరతనంలో
ఎన్ని వున్న కాంగ్రెసేర నీ యిలవేల్పు
కాంగ్రెసేర నిన్ను కన్న తల్లి

### ప్రసన్నకుమార్

తెలుగుదేశమందు తలదూర్చినా నీవు
తప్పుగాదు దాన్ని తంపరాదు
వచ్చి దుగ్గితయ్య సాధించవేముంది
లక్షలాది ఖర్చు లాసు ప్రతిది

వచ్చి కలుసుకుంటె వదిలేది కష్టమ్ము
పాలిటిక్సు అదొక పాడు వ్యాధి
యిచ్చి పిచ్చి కవిని ఏటిలో వ్రాస్తాను
గేసుతాను ప్రొద్దుపోక తెయిలీ

## వై.ఎస్. ఇంటి సోదా

మొదటి పేజీ తరువాయి

జరిగినపుడు వై.ఎస్. మద్రాసులో వున్నారు. విషయం తెలుసుకున్న తర్వాత ఆయన హుటాహుటిన కడపకు చేరుకున్నారు. తన మద్దతు దారులందరితో ఆయన సమావేశమయ్యాక 'హోంమంత్రి' రాజీనామా చేయాలన్న డిమాండ్ చేశారు. ఎమ్మెల్యే వరదరాజులు రెడ్డి అయితే ఏకంగా మైసూరాను క్యాబినెట్ నుంచి బర్తరఫ్ చేయాలని ముఖ్యమంత్రిని కోరాడు. అయితే హోంమంత్రి మాత్రం ఈ సంఘటన గురించి తనకేమీ తెలియదని ముఖ్యమంత్రికి వివరణ ఇచ్చుకున్నాడు. ముఖ్యమంత్రి ఈ విషయంలో ఆగ్రహంగా వున్నారట. పోలీసుల గాలింపుకు సంబంధించిన పూర్వాపరాలను తనకు తెలియజేయాల్సిందిగా ముఖ్యమంత్రి పోలీసు శాఖ ఉన్నతాధికారులను ఆదేశించారు. ఈ సంఘటన పై ముఖ్యమంత్రి ప్రతిస్పందించే తీరు పై తమ భవిష్యత్ కార్యక్రమం ఆధారపడి వుంటుందని వై.ఎస్. వర్గీయులు చెబుతున్నారు.

### మైసూరాకు స్థాన చలనం?

త్వరలో జరిగే మంత్రి వర్గ మార్పుల్లో మైసూరా రెడ్డిని హోం శాఖ నుంచి తప్పించి ఇతర శాఖను అప్పగిస్తారా? వైఎస్‌తో సంబంధాలు తుంచుకో కూడదనుకుంటె ముఖ్యమంత్రికి ఇంతకంటె గత్యంతరం లేదు. అయితే ఏకంగా హోంమంత్రిని మంత్రి వర్గం నుంచి తీసెయ్యాలన్న వై.ఎస్. వర్గీయుల డిమాండ్‌కు మాత్రం ముఖ్యమంత్రి తల ఒగ్గక పోవచ్చు.

### ప్రయివేటు బస్ ఆపరేటర్ల తలనొప్పి

ముఖ్యమంత్రికి రాజకీయంగా మరో తలనొప్పి పట్టుకుంది. ప్రైవేట్ బస్ ఆపరేటర్లు అక్రమంగా సర్వీసులు నడుపుతున్న కారణంగా ఆర్టీసీకి నెలకు 60 లక్షల రూపాయలు నష్టం వస్తోంది. ఈ సర్వీసులు ఎక్కువగా ముఖ్యమంత్రి జిల్లా అయిన కర్నూలు లోనే నడుస్తున్నాయి. ఆ తర్వాత ఆర్ అండ్ బి మంత్రి దివాకర రెడ్డి జిల్లా అయిన అనంతపురంలో వున్నాయి. సాక్షాత్తు రవాణా మంత్రి ఆలపాటి ధర్మారావు సొంత జిల్లా గుంటూరులో, మరీ ముఖ్యంగా ఆయన సొంత ఊరు తెనాలి నుంచి అక్రమ సర్వీసులు జోరుగా నడుస్తున్నాయి. అక్రమ సర్వీసులను నిలిపి వేయాలని కోరుతూ ఆర్టీసీకి సంబంధించిన కార్మిక సంఘాలు త్వరలో ఆందోళనకు దిగనున్నాయి.

రాష్ట్రంలో ప్రైవేటు బస్ ఆపరేటర్ల లాబీ చిన్నదేమీ కాదు. కాంగ్రెస్ మంత్రులు, ఎమ్మెల్యేల బంధువులు చాలా మంది ప్రైవేటు బస్ ఆపరేటర్లుగా వున్నారు. మంత్రి దివాకర్ రెడ్డికి ప్రైవేట్ బస్సులున్నాయి. వీటికి సంబంధించి ముఖ్యమంత్రితో ఇటీవల దివాకర రెడ్డి గొడవ పడ్డారు కూడా. ముఖ్యమంత్రి చిత్తశుద్ధికి ఈ సమస్య పెద్ద సవాలుగా తయారైంది. దీని పై ముఖ్యమంత్రి ఏం చర్యలు తీసుకుంటారో వేచి చూడాల్సిందే.

* * *

లోక్‌సభ సభ్యుడు డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి ఇంటిని పోలీసులు సోదా చేశారు. కడప లోని వై.ఎస్. ఇంట్లో మారణాయుధాలున్నట్లు రహస్య సమాచార మందగంతో పోలీసులు హుటాహుటిన వెళ్లి వై.ఎస్. ఇంటిని గాలించారు. అయితే ఇంట్లో ఏ విధమైన మారణాయుధాలూ దొరకలేదట. దీనితో ఈ వ్యవహారం కాస్తా ముదిరి పాకాన పడింది. ఎమ్పీ ఇల్లు అని కూడా చూడకుండా కేవలం ఆకాశ రామన్న సమాచారంతో సోదా చేయడం వెనుక వైఎస్ ప్రతిష్టను దెబ్బతీయాలన్న "రాజకీయ కుట్ర" వుందని వై.ఎస్. వర్గీయులు ఆరోపిస్తున్నారు. వై.ఎస్. ఇంటిని సోదాచేసే "ధైర్యం" జిల్లా పోలీసులకు వచ్చిందంటె దాని వెనుక హోంమంత్రి డాక్టర్ మైసూరా రెడ్డి అదృశ్య హస్తం ఉండకుండా ఎలా వుంటుందని వై.ఎస్. వర్గీయులు అనుమానిస్తున్నారు. హోంమంత్రికి, వైఎస్‌కు మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది. ఈ వ్యవహారంలో వారిద్దరి మధ్య సంబంధాలు మరింత దెబ్బతిని ఏ పరిణామాలకు దారి తీస్తాయో చూడాలి.

ముఖ్యమంత్రికి, వై.ఎస్. కు మధ్య సంబంధాలు బాగుంటున్నాయనుకుంటున్న సమయంలో సోదా వ్యవహారంతో దెబ్బతిన్న వైఎస్ మనస్సు ఎలా స్పందిస్తుందో, దీని పరిణామాలు రాష్ట్ర రాజకీయాల పై ఎలా వుంటాయో వేచి చూడాల్సిందే.

## రోశయ్య

మొదటి పేజీ తరువాయి

వెళ్లమని ముఖ్యమంత్రి ఒత్తిడి తెస్తున్నారు. రోశయ్య మాత్రం వెనకా ముందు ఆలోచిస్తున్నారు. రోశయ్య అంగీకరించే పక్షంలో మంత్రి వర్గంలో మరో సీటు ఖాళీ అవుతుంది. ఉపఎన్నికల తర్వాత పిసిసి పీఠాన్ని మార్చడంతో పాటు మంత్రి వర్గాన్ని కూడా పునర్వ్యవస్థీకరించి ఎన్నికలకు సిద్ధం కావాలని ముఖ్యమంత్రి భావిస్తున్నారు. ఈ సారి మంత్రి వర్గం "ఎలక్షన్ క్యాబినెట్" గా వుంటుందని ముఖ్యమంత్రి వర్గీయులంటున్నారు. జిల్లా నాయకత్వాన్ని స్వీకరించి ఎన్నికల బాధ్యతను భుజస్కంధాల పై మోసే సీనియర్, సమర్థత కల వారికి మాత్రమే మంత్రి పదవులు ఇవ్వాలన్నది కోట్ల వారి అభిప్రాయం. రాష్ట్రంలో వున్న చెన్నా, వై.ఎస్. తదితర గ్రూపులకు కూడా తగినంత ప్రాతినిధ్యం ఇచ్చి అసమ్మతికి తావు లేకుండా చేసుకోవాలని కూడా కోట్ల భావిస్తున్నారు. ఉపఎన్నికల తర్వాత రాష్ట్ర అసెంబ్లీ స్పీకర్ శ్రీపాద రావుకు కూడా స్థాన చలనం తప్పదంటున్నారు. ఆయనను మంత్రి పదవి ఇచ్చి ఆ స్థానంలో తన వర్గీయుడ్ని కూర్చొబెట్టాలని ముఖ్యమంత్రి నిర్ణయానికి వచ్చారు.

## జిల్లా వార్తలు

5 పేజీ తరువాయి

అసమర్థత తోడవ్వడంతో ఆ గ్రామం మంచి నీటి కై కటకట లాడుతూంది. వెంకటాచలం మండలం సర్వేపల్లి గ్రామంలో ప్రజలు ఎదుర్కొంటున్న మంచి నీటి సమస్య పరిష్కారానికి రెండో పైపు లైను వేసేందుకు గత సంవత్సరంలో ప్రభుత్వం లక్ష రూపాయలు మంజూరు చేసింది. పనిని యుద్ధ ప్రాతిపదిక పై పూర్తి చేసేందుకు సి.ఆర్.పి. ఇంజనీర్లకు బాధ్యత అప్పగించారు. పనైతే పూర్తి జేసారు గాని నీరు వదలగానే వేసి వున్న పైపులు పగిలి పోయాయట. ఆ రోజు నుండి కాంట్రాక్టర్ పత్తా లేకుండా పోయాడని సర్పంచ్ కొండూరు సుబ్బరామిరెడ్డి ఆరోపణ. సంవత్సరం నుండి మూల పడ్డ ఈ మంచినీటి పైపు లైను విషయం పట్టించుకోమని అధికార్లతో పాటు ప్రభుత్వ విప్, సర్వేపల్లి శాసనసభ్యులు శ్రీ సి.వి. శేషారెడ్డి దృష్టికి తీసుకెళ్లినా ప్రయోజనం లేదని వాపోతున్నారు. విప్ గారు మనసు పెడితే పెద్ద పనా అది?

### కడుపులో 131/2 కేజీల గడ్డ

బోగోలు మండలం అల్లిమడుగు అగ్రహారానికి చెందిన కీర్తి కొండమ్మ (80) కడుపులో వుండిన 131/2 కేజీల గడ్డను కావలి ప్రజా వైద్యశాల డాక్టర్లు 10 తేది విజయవంతంగా శస్త్ర చికిత్స చేసి తొలగించారు. కడుపు నొప్పితో గత పది సంవత్సరాలుగా బాధ పడుతున్న కొండమ్మకు స్కానింగ్ పరీక్ష చేయిస్తే గాని గడ్డ విషయం తెలియరాలేదు. డాక్టర్ సీమా నాయకత్వంలో డాక్టర్ మోలాలీ, డాక్టర్ సుబ్బారెడ్డి రెండున్నర గంటల పాటు శ్రమించి శస్త్ర చికిత్స చేసి రోగి బరువు తగ్గించారు. జిల్లాలో జరిగిన శస్త్ర చికిత్సల్లో ఇది అత్యంత అరుదైనదని చెబుతున్నారు.

### చెస్ పోటీలు

క్వీన్ ఇండియన్ చెస్ క్లబ్ ఆధ్వర్యంలో 21 తేది నుండి 23 వరకు మెట్రిక్స్ క్లబ్‌లో అంతర్ జిల్లాల ఓపెన్ చెస్ పోటీలు జరుగనున్నాయి. ఆసక్తి గల నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు పరిధిలోని జిల్లా క్రీడాకారులు పాల్గొనవచ్చని నిర్వాహకులు తెలియజేస్తున్నారు.

## పంచాంగము

### రోహిణీ కార్తె

తేది 25 మంగళవారము రోహిణి కార్తె ప్రారంభం
తేది 26 శుక్రవారము కర్తరి సంపూర్తి

### ముహూర్తములు

తేది 26 బుధవారము ఉదయం 7.20 గంటలకు మిధున లగ్నమున వ్యాపార, అక్షరాభ్యాస, ఉపనయన వివాహములకు
తేది 28 శుక్రవారము ఉదయం 8.06 గంటలకు మిధున లగ్నము వివాహ ఉపనయన వ్యాపార ప్రారంభములకు సుముహూర్తములు కలవు.

### మే నెల తిథులు

జ్యేష్ఠ శుద్ధ

తే 22 శని పాడ్యమిరా.గ.7.30 వ
తే 23 ఆది విదియ రా.గ 7.15వ
తే 24 సోమ తదియ రా.గ. 6.40 వ
తే 25 మంగళ చతుర్థి సా.గ. 5.30వ
తే 26 బుధ పంచమిసా.గ.3.45 వ
తే 27 గురు షష్ఠి ప.గ. 1.54వ
తే 28 శుక్ర సప్తమి ప.గ. 11.50 వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

### నీటిమట్టం

నెల్లూరు చెరువు ........ 11.6అ
సర్వేపల్లి రిజర్వాయరు ........ 2.1అ
కనిగిరి రిజర్వాయరు ........ 12.5 అ

### నెల్లూరు ఎండ

15 తేది ........ 98.0
16 తేది ........ 106.6
17 తేది ........ 105.2
18 తేది ........ 104.9
19 తేది ........ 99.3
20 తేది ........ 97.0

### నెల్లూరు బజారు

మొలగొలుకులు

| | |
|---|---|
| 9672 (పాతవి) | 3,700/- |
| 9672 (కొత్తవి) | 3,100/- |
| 9674 (పాతవి) | 3,800/- |
| 9674 (కొత్తవి) | 3,200/- |
| ఐ.ఆర్. 20 | 2,500/- |
| బియ్యం బస్తా (70 కేజీలు) | 540/- |
| బియ్యం (కేజీ) | 8/- |
| బంగారు సవర (8 గ్రా) | 3,400/- |
| వెండి (10 గ్రా) | 62/- |
| పెసలు (100 కిలోలు) | 950/- |
| వేరుశెనగ నూనె (కేజీ) | 24.50/- |
| మిరపకాయలు (కేజీ) | 20/- |
| చింతపండు (కేజీ) | 16/- |
| చక్కెర (కేజీ) | 11.80/- |
| బెల్లం (కేజీ) | 13/- |
| కందిపప్పు (కేజీ) | 18/- |
| పెసర పప్పు (కేజీ) | 15/- |
| మినప పప్పు (కేజీ) | 10.50/- |

# హిందీ తారలకు దక్షిణాదిన గిరాకీ తగ్గి పోయింది!

నగ్మా, ఖిరా, పూజా బేడి వంటి బొంబాయి తారలను బుక్ చేయడానికి ఇది వరకు ఎంతో తాపత్రయ పడ్డ దర్శక, నిర్మాతలు బొంబాయి ప్రేలుళ్ల దుర్ఘటనల అనంతరం "ఏ క్షణంలో మళ్లీ ఏ ఉపద్రవం ముంచుకొస్తుందో, ఎందుకు లేని పోని ఇబ్బందులు?" అని దక్షిణ భారత తారలనే బుక్ చేసుకుంటున్నారు.

## సినిమా

ఈ వెల్లువలో గౌతమి, భానుప్రియ వంటి తారలకు చాలా కాలం తర్వాత తెలుగు చిత్రాలలో మళ్లీ నటించే అవకాశాలు లభిస్తున్నాయి.

### "భైరవ ద్వీపం"

"బృందావనం" అనంతరం బాలకృష్ణ, రోజాలతో సింగీతం శ్రీనివాస రావు దర్శకత్వంలో చందమామ విజయ కంబైన్స్ నిర్మించే "భైరవద్వీపం" జానపద చిత్రం పూర్తిగా మద్రాసులోనే షూటింగ్ జరుపుకుంటుందని నిర్మాత బి. వెంకట్రామిరెడ్డి తెలిపారు. జూన్ 3 నుంచి 16 వరకు తొలి షెడ్యూల్ జరుగుతుంది. సంగీతం: మాధవపెద్ది సురేష్, ఛాయ: కబీర్‌లాల్, కళ: పేకేటి రంగా, సంభాషణలు: రావికొండల రావు

### పరచూరి కోరిక!

జంట రచయితలైన పరచూరి బ్రదర్స్‌లో అగ్రగణ్యులైన వెంకటేశ్వరరావుకి చిరకాలంగా ఒక కోరిక మిగిలివుంది. ఎందరు హీరోలు, దర్శకుల చిత్రాలకు పనిచేసినా, విశ్వనాథ్, బాపు దర్శకత్వం వహించే చిత్రాలకు వీరు మాటలు రాయాలనే కోరిక, కోరికగానే మిగిలివుందట. సాంప్రదాయాలను చక్కగా చిత్రీకరించే వీరి చిత్రాలకు మాటలు రాసే అదృష్టం 'తమాస్' రచయితలకు వస్తుందా? మనసంస్కృతి.

# వీధి షూటింగుల వల్ల గ్లామర్ పోయింది!

ఇది వరకు స్టూడియో ఫ్లోర్‌లలో నాలుగు గోడల మధ్య షూటింగ్‌లు జరగడం వల్ల సినిమా తారలన్నా, సినిమా జనమన్నా అదో గ్లామర్, క్రేజ్ వుండేది. చాలా వరకు తప్పని సరి అయితే తప్ప ఔట్ డోర్‌లో షూటింగ్‌లు జరిగేవి కావు. రాయితీల మూలంగా ఇటీవల మన రాష్ట్రంలో ఎక్కడ బడితే అక్కడ షూటింగ్‌లు జరుగుతూండడం మూలంగా ప్రజలకు ఇది వరకటి మోజు తగ్గిందనే చెప్పాలి. కూపీలతో ఫైట్స్ తీయడం వల్ల, సినిమా టెక్నిక్ కొంత వరకు తెలిసి పోయినందు వల్ల జనం వెండి తెర మీద థ్రిల్ పొందలేక పోతున్నారు. ఎక్కడో ఒక చోట ఏదో ఒక ఔట్ డోర్ షూటింగ్‌లో తారలను చూస్తూండడం వల్ల "ఎదురుగా చూసిన వీళ్లను మళ్లీ తెర మీద చూడడమెందుకులే" అని క్రేజ్‌ను తగ్గించుకున్న వారు కూడా ఉన్నారు. ఇవాళ చాలా సినిమాలు ఇదివరకటిలా ఆదరణ పొందక పోవడానికి ఇదొక

గరవ 10 పేజీలో

ఆసలే పెళ్ళయిన వాణ్ణి చిత్రంలో సౌందర్య

# రికార్డ్ కలెక్షన్లా? రాజకీయ రాద్ధాంతాలా?

విడుదలవడానికి ముందు నుంచే "మేజర్ చంద్రకాంత్" గురించి ఏ చిత్రానికి లేనంతగా రకరకాల టాక్‌లు

## మేజర్ చంద్రకాంత్

వచ్చాయి. సూపర్ హిట్ అవుతుందని కొందరు, ఫ్లాప్ అవుతుందని మరి కొందరు పనికట్టుకుని ప్రచారం చేశారు. ఆ చిత్రం విడుదలయ్యాక ప్రేక్షకుల తీర్పు ఎలా ఉంటుందో అని అందరూ ఎంతో ఉత్కంఠతతో ఎదురు చూశారు. రికార్డ్ కలెక్షన్ - అని మొదటి వారం రిపోర్టు. రెండో వారం నుంచి నైజాం ప్రాంతంలో కలెక్షన్స్ డ్రాప్ అయ్యిందని, కొన్ని చోట్ల రిపీట్ ఆడియన్స్ లేరని, కొన్ని ప్రాంతాల్లో ఎ–సెంటర్ కన్నా బి.సి– సెంటర్లో బాగా ఆడవచ్చనీ ఒకదానికొకటి పొంతనలేని రిపోర్టులొస్తున్నాయి. ఏ విషయమూ ఖచ్చితంగా తేలడానికి మరి కొన్ని రోజులు పట్టవచ్చు. మొత్తం మీద విభిన్న స్వరాలు వినబడడానికి కొన్ని రాజకీయ పార్టీలే కారణమన్నది నిర్వివాదాంశం.

### 30 లక్షల రూపాయలు పరుశురామ ప్రీతి

కథ, కథనాలలో నవ్యత చూపబడం ఇక అసాధ్యం గనుక ప్రేక్షకులను థియేటర్‌లోకి ఆకర్షించడానికి భారీతనం ఒక్కటే మార్గమని తమిళ దర్శకుడు ఆర్.కె. సెల్వమణి విశ్వాసం. ఆయన దర్శకత్వంలో నటి రోజా సోదరుడు వై. కుమారస్వామిరెడ్డి నిర్మించే "సమరం 1993" చిత్రానికి ఇటీవల అన్నపూర్ణ స్టూడియోస్ వద్ద ఏకెకరాల స్థలంలో వేసిన 30 లక్షల స్లమ్ సెట్‌ను బాంబులతో పూర్తిగా తగలబెట్టారట – ఎంతో రియలిస్టిక్‌గా! 300 గుడిసెలు అగ్నికి ఆహుతి కాగా మంటలు గగనానికి ఉవ్వెత్తున లేచాయట. "ఇలా తగలడడం మామూలే గాని, తగలెట్టిన విధానంలో నాటి ఉంది ... దర్శకుడి ప్రతిభ" వరసా!

CROWN-TV
CROWN-T.V
కలర్ మరియు B/W TVలపై
DIGITAL
ఆథరైజ్‌డ్ డీలర్స్
స్టీరియో సౌండ్స్
Ph:25428
ట్రంక్ రోడ్-నెల్లూరు.

# వాస్తవాలకు దగ్గరగా లేని వాస్తవం

వాస్తవం చిత్ర దర్శకుడు వాల్మీకి తన చిత్ర కథకు నేడు సమాజంలో జరుగుతున్న పలు వాస్తవ సంఘటనలను తీసుకున్నా, వాటిని సమర్థవంతంగా తెరకెక్కించలేక పోయాడు. ప్రభుత్వ ఆసుపత్రులలో పెచ్చు పెరిగి పోతున్న అవినీతి, వారికి మద్దతు నిస్తున్న రాజకీయ వ్యవస్థ, న్యాయ వ్యవస్థల తీరును దుయ్యబట్టారు. కాని స్క్రీన్‌ప్లే పటిష్ఠంగా రూపొందించుకోలేక పోవడం, చవకబారు ఫిలిమ్ పై ప్రింటింగ్‌కు తోడుగా సెన్సార్ కత్తిరింపులు ఈ చిత్రాన్ని నిస్సత్తువ చేశాయి. పదునైన మాటలు, కృతిమించని హాస్యం, చిన్నారి పాప లాలిత్యం ఒకింత సేపు హాల్‌లో కూర్చో బెడతాయి. అవినీతి, అక్రమాలకు సామాన్యుడు కూడా అలవాటు పడి పోతున్న ఈ రోజుల్లో అందరినీ మార్చలేక పోయినా కనీసం కొందరైనా ఆత్మావలోకనం చేసుకొనేందుకు ఈ చిత్రం తప్పక వుపయోగ పడుతుంది.

ఇక కథలోకి వెళితే వృత్తి ధర్మాన్ని నిజాయితీగా నెరవేర్చాలని ప్రభుత్వ ఆసుపత్రికి డాక్టర్ గా వచ్చిన అశోక్ (సురేష్) ఆసుపత్రిలో జరుగుతున్న అవినీతిని చూసి మధన పడినా, తాను నమ్మిన మార్గాన్ని మాత్రం వీడడు. ఆసుపత్రిలో రోగులందరికీ ఆప్తుడవుతాడు. ఆ పట్నంలో ప్రతి దుష్కార్యం వెనక మూల పురుషుడైన శంకర్ దాదా (మన్సూర్ ఆలీఖాన్) తమ్ముడు కాలేజీలో జరిగే ఎలక్షన్‌లో తనకు పోటీగా నిలబడతానని ముందుకొచ్చిన శాంతిని క్లాస్ రూంలోనే దారుణంగా రేప్ చేసి, పెట్రోల్ పోసి తగలబెడతాడు. ఈ వాస్తవ సంఘటనను పలువురు చూసినా సాక్ష్యం చెప్పేందుకు ముందుకు రాని దశలో ఎస్.పి. కిరణ్మయి (శివరంజని)

## చిత్రసమీక్ష

****

అల్లూరు రహీం

ప్రోత్సాహంతో అరుణ (దివ్యవాణి) తమ్ముడు ప్రసాద్ ముందుకొస్తాడు. శాంతి శవం పోస్టుమార్టం రిపోర్ట్ తనకు అనుకూలంగా రాయకుంటే అంతుచూస్తానని డాక్టర్‌ను బెదిరిస్తాడు దాదా. వాస్తవ రిపోర్ట్‌ను తన మిత్రురాలు ఎస్.పి. కిరణ్మయికి సమర్పిస్తాడు డాక్టర్ అశోక్. సాక్ష్యం చెప్పను ముందుకొచ్చిన ప్రసాద్ పై హత్యాయత్నం చేయగా చావు బతుకుల్లో వున్న అతనికి హాస్పిటల్‌లో తన వార్డు కాకపోయినా వైద్య చికిత్స చేసినందుకు అశోక్‌ను హాస్పిటల్ సూపరింటెండెంట్ (జీవా) సస్పెండ్ చేస్తాడు. గుండె జబ్బుతో బాధపడుతున్న పాప కవిత (బేబి శ్రీదేవి) విజయవంతంగా ఆపరేషన్ చేసినా సెలైన్ కలుషితమైనది కావడం వల్ల పాప మరణిస్తుంది. రాజకీయాలకు తలఒగ్గిన న్యాయస్థానం డాక్టర్ విధి నిర్వహణలో విఫలం చెందడం వల్ల పాప చనిపోయినట్టు భావించి అశోక్ డాక్టర్ డిగ్రీని 5 ఏళ్ల పాటు సస్పెండ్ చేస్తుంది.

అప్పటి వరకు కుళ్లిపోయిన అవయువలకే శస్త్ర చికిత్స చేస్తున్న డాక్టర్ ఆ కుళ్లి పోయిన సమాజాన్ని ప్రక్షాళన చేయను బయలు దేరుతాడు. పూర్వాశ్రమంలో కార్పొరేషన్‌లో చెత్త కుప్పలు ఎత్తుకుంటున్న వెంచయ్య (కోట శ్రీనివాస రావు) తరువాత మేయర్ అయి, దాదాతో చేయి కలిపి అతని వ్యాపారాల్లో పార్టనర్‌గా వుంటాడు. అశోక్ ధైర్యంగా వారి సెలైన్ ఫ్యాక్టరీ మూయించడమే కాకుండా ఎమ్‌సెట్ పేపర్ అవుట్ చేసి డబ్బు గడించాలనుకొన్న మేయర్ ఎత్తుగడకు అడ్డుపడి, విద్యార్థుల అభిమానాన్ని సంపాదించి నాయకుడుగా మారుతాడు. ప్రజలను చైతన్య పరచి అందరి భాగోతాలకు వారి సహకారంతో చరమగీతం పాడిస్తాడు.

చిత్ర కథాగమనంలో పటుత్వం లోపించింది. చివరి సీన్లు మరి బలహీనంగా వున్నాయి. స్టార్ వాల్యూ

గరవ 10 పేజీలో

శ్రీ లక్ష్మీనృసింహాయనమః

శ్రీ వేదగిరి లక్ష్మీనృసింహస్వామి వారి దేవస్థానము

నరసింహాలు కొండ, నెల్లూరు రూరల్ మండలము, నెల్లూరు జిల్లా

నెల్లూరు జిల్లా, నెల్లూరు రూరల్ మండలము, నరసింహాలు కొండ పై వేంచేసి యున్న శ్రీ వేదగిరి లక్ష్మీ నృసింహ స్వామి వారి దేవస్థానమునకు హక్కు, అనుభవము గల ఈ దిగువ తెలుపబడిన ప్లాట్లు 1.7.93 తేది నుండి 30.6.96 వరకు (అనగా మూడు సంవత్సరములకు) లీజుకు ఇచ్చుటకు గాను 2.6.1993 తేది ఉదయం 11.00 గంటలకు దేవస్థానము కార్యాలయము వద్ద డిపార్టుమెంటు అధికారుల పర్యవేక్షణలో బహిరంగ వేలము పాట జరుపబడును.

ప్లాటు నెం: 1: య. 300.00 సెంట్లలో కంకర, గ్రావెల్ త్రవ్వి తీసుకొను వెళ్లు లారీలకు రుసుము వసూలు చేసుకొను హక్కు వేలము.

ప్లాటు నెం. 2: య 10.00 సెంట్లలో గ్రానైటు కొట్టుకొనుటకు గాను లీజు హక్కు వేలము.

పై వేలము పాటలలో పాల్గొనదలచిన వారు ప్లాటు ఒకటికి రూ. 1,000.00 లెక్కన ధరావత్తు చెల్లించి పాటలో పాల్గొనవలయును. పాట హెచ్చు పాట దారుని పేర తెగిన వెంటనే డిపాజిట్టు సైకముతో కలిపి పూర్తి సైకము (అనగా ఒక సంవత్సరము లీజు మొత్తం) దేవస్థానమునకు చెల్లించి రశీదు పొందవలయును. హెచ్చుపాటదారుడు అట్లు బాధ్యతగా వ్యవహరించని యెడల అతను చెల్లించిన ధరావత్తు దేవస్థానమునకు జమ కట్టు కొనుటయే గాక అందువలన వచ్చు కష్టనష్టములకు హెచ్చుపాట దారులు బాధ్యత వహించు నిర్ణయము మిగతా వేలము షరత్తులు దేవస్థానము కార్యాలయములో అడిగి తెలుసుకొనవచ్చును.

వేగూరు రవీంద్రరెడ్డి
కార్యనిర్వహణాధికారి

జమీన్‌రైతు
సంవత్సరమంతా రూ. 100/-
ఆరు నెలలకు రూ. 50/-
విడిప్రతి రూ. 2.00

## In the Court of the Addl. Sub Judge, Chittoor.

O.E.P. No. 11 of 1991
O.S. No. 91 of 1987

Between:
Navabharath Finance Corporation (Regd.), Chittoor represented by its Managing Partner G. Narayanaswami Naidu
– Decree-holder

And

Smt. R.M. Jayamma and Another – Judgement-debtor

### NOTICE

The under mentioned immovable properties of the J.D.s will be sold in public auction in the premises of this court on 24.6.1993 between 10.30 A.M. and 5.00 P.M. Schedule of Properties to be sold.

(1) Tiled house (Old Nos. 219/5 and 241 and New No. 6-4-14 in Gandla Street, Santhapet, Chittoor and measuring E to W 55' 4" and N to S 18' 3" on the western side, and 18' on the eastern side, including doors etc., vacant site, draw well and half right in common walls on the northern and southern sides.
Encumbrances .. Nil

(2) Wet land in No. 74, Thimmasamudram Village, Chittoor Taluk bearing S.No. 350 ac. 0.93 cents in extent with kist of Rs. 7-14-0. In this item on the northern side, to the East of the Kasam Kalwa, to the south of the lands of A. Venkatasidda Reddy and others, to the west of the lands of Subramanya Chetty and Chengamma in S.No. 345/2, North of the lands of Subramania Chetty, in the extent ac 0.49 1/2 cents and kist of Rs. 4-2-0. This extent with green manure trees and half share in well along with Subramaniam Chetty, owning the other half in the well (1/2 share in item No. 2 jointly purchased with Rathnamma, W/o. Srinivasula Chetty of Velkur Village under sale deed dated 27.6.63.
Encumbrances: Nil

D.H. Valuation - Item 1 Rs. NIL
Amin's Value - Item 1 Rs. 40,000/-
D.H.'s Valuation Item 2 Rs. NIL
Amin's Value Item 2 Rs. 93,000

Chittoor V.V. Gowrisankar,
3-5-93 ADVOCATE

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

E.P. 46/91 : O.S. 82/88

S.B.I. Nellore Town - D.H.R.
Vendoti Venkaiah - J.D.R

To
Vendoti Venkaiah
S/o. Narasaiah,
Bujabuja Nellore, NELLORE DT

అనువారికి పై నంబరు D.H.R. E.P. పరిహార నిమిత్తం మీ మీద E.P. దాఖలు చేసి యున్నందున మీరు తేది 24.6.93 ఉదయం 10.30 గంటలకు పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకొనని యెడల మీ పరోక్షమందు కేసు తీర్మానించబడును.

వాయిదా: 24.6.93

సి. పరాంకుశరావు
D.H.R. తరఫు అడ్వోకేటు,
14/120, నెల్లూరు

## నెల్లూరు సబ్ కోర్టులో

S.C.S. 182/92

సిండికేటు బ్యాంకు, నెల్లూరు – వాది
1. లెబూరు సువర్చల వగైరా – ప్రతివాదులు

To, 1. లెబూరు సువర్చల. W/o. కృష్ణమూర్తి. 2. వేలూరు కృష్ణమూర్తి. S/o. సుబ్బరాయ శర్మ. 22-53T, A.C. నగర్, నెల్లూరు.

పై నంబరు బ్యాంకు మీ మీద దావా బాకీ రాబట్టుకొనుటకు దావా దాఖలు చేసినందున యిందు విషయమై మీకు నోటీసు నిమిత్తం 1-7-93 తేదిన వాయిదా వేసినారు. కాన ఆ రోజు వుదయం 10.00 గంటలకు పై కోర్టు వారి ఎదుట హాజరై మీకు గల ఆక్షేపణలు తెలుపుకోవలసినది. లేని ఎడల మీ పరోక్షమందు తీర్మానించబడును.

**M. Raveendra Reddy**
Advocate for Plantiff

## నెల్లూరు సబ్ కోర్టులో

O.S.No. 131/1991

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నెల్లూరు – వాది
Vs
1. రాజా సాహెబ్ వగైరాలు - ప్రతివాదులు

### నోటీసు

1. రాజా సాహెబ్ C/o. విద్యాసాగర్. 2. మహబూబ్ బి C/o. విద్యా సాగర్, డోర్ నెం. 28/176, వెంకట్రామపురం, నెల్లూరు.

ఇందుమూలముగా మీకు తెలియజేయ చేమనగా పై నెంబరు వాదికి రావలసిన బాకీ మొత్తము రూ. 31,180.10 పైసలు రాబట్టుకొనే నిమిత్తమై మీ మీద దావా వేసియున్నారు. సదరు దావా నోటీసు నిమిత్తమై 23.6.93 తేదికి వాయిదా వేయబడి వున్నది. సదరు 23.6.93 తేదిన మీరు పై కోర్టులో ఉదయం 10 గంటలకు హాజరై ఆక్షేపణలు ఉన్నయెడల స్వయముగగాని, వకీలు ద్వారా గాని తెలుపుకొన వచ్చును. లేని యెడల సదరు మీ పరోక్షముగ తీర్మానించ బడును.

M. గోపాలాచారి
వాది అడ్వోకేటు

## శంకరాచార్యులు

4 పేజీ కొరవ

గ్రంథాలలోని నిగూఢ భావాలకు సరళమైన రీతిలో విపులీకరించి భాష్యం చెప్పడం వారి బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనాలు. వారి సన్నిధానంలో కూర్చుండిన ఐదు నిమిషాలైనా సరే మన మనస్సులో ఎట్టి ఆలోచనలు లేకుండా అవ్యాజానందాన్ని పొందుతాము. ఆయన మౌనమే మనకు సందేశము, ఆశీస్సులు. బాల్యంలోనే బైబిల్‌ను సునిశితంగా అధ్యయనం చేసి ఆంగ్లంలో క్రొత్తగా విషయ వివరణ లివ్వినందుకు జీవితాంతం పొందారంటే ఆయన సునిశిత జ్ఞానదృష్టి, విశాల దృక్పథమెంతటిదో మనకు తెలుస్తుంది.

1907 లో పీఠాధిపత్యం వహించిన తరువాత కావేరి నది ఉత్తర తీరాన గల మహేంద్ర మంగళంలో ఒక పర్ణశాల నిర్మించుకొని 1911 మొదలు 1914 వరకు శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామి వారు తదేక దీక్షతో విద్యాభ్యాసం చేశారు. ఆయా శాస్త్రాలలో నిష్ణాతులైన పండితుల వద్ద తర్క, వ్యాకరణ మీమాంస వేదాంత శాస్త్రాలను నేర్చుకున్నారు. ఇంగ్లీషు, హిందీ, ఫ్రెంచి, తమిళ, కన్నడ, తెలుగు మొదలైన 16 భాషలు సంస్కృతముతో పాటు నేర్చుకున్నారు. తమిళ సంస్కృత కావ్యప్రబంధాలు కరకుట్టజూచారు. సంగీత, చాయగ్రహణ కళలు వారికి క్షుణ్ణముగా తెలుసు. గణిత జ్యోతిష ఖగోళ శాస్త్రాలను సమగ్రంగా పరిశోధన పట్టారు. ఇంతటి విజ్ఞానాన్ని ఎలా సాధించ గలిగారన్నది విద్యావేత్తలకు విజ్ఞానువులకు జవాబు లేని ప్రశ్నగా నిలచింది "శంభోర్మూర్తిః చరతి భువనే శంకరాచార్య రూపః" అని మనం చెప్పుకొన వలసిందే. శిల్పాగమ మంత్ర కళాభాషా ప్రవీణులు వారు. వారి ఉపన్యాసము, వారిని గూర్చిన గ్రంథాలు చదివితే మనకె తెలుస్తుంది విషయము.

సామాన్యుడికి హిందూ ధర్మాన్ని గూర్చి, మతాన్ని గూర్చి, అద్వైత తత్వాన్ని గూర్చి అవగాహన కలిగించాలనే ఆలోచనతో ఆయన మొత్తం ఐదు సార్లు యావద్భారత దేశాన్ని పాద సంచారం చేశారు. వారు కార్లు వ్యానులు ఎక్కింది లేదు. ఎన్ని వందల మైళ్ల దూరమైనా నడకే. "తిరుక్కూత్తు" అనే జానపద కళారూపాన్ని ఆయన ఏర్పరచి ప్రజలకు మతం పై అవగాహన కలిగించారు. శిల్పాగమ జ్యోతిష వేద సభలను తరచు నిర్వహించి , ప్రాచీన భారతీయ విజ్ఞానమందు సామాన్యులకు విశ్వాసాన్ని పునః ప్రతిష్ఠించారు. నెల్లూరు దర్గామిట్టలోని శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారు, వారి చేతుల మీదుగా ప్రతిష్ఠించ బడిన దేవతా మూర్తి. జన్నవాడలో శ్రీ చక్ర పునరుద్ధరణ చేశారు. నెల్లూరుతో వారికి సాన్నిహిత్యమున్నది. దాదాపు ఐదారు పర్యాయములు నెల్లూరుకు వచ్చారు.

ప్రతిరోజు, ప్రతి కుటుంబం ఒక పిడికెడు బియ్యాన్ని తీసిపెట్టి వారాంతంలో దాన్ని ఏదైనా ఒక సేవాసంస్థకు అందించి పేదలకు అన్నదానం చేయమని వారి కోరిక. దీన్ని తమిళంలో "పిడి అరిసి తిట్టం" అంటారు. నేటికీ కంచిలో ఈ విధానం కొనసాగుతూ పేద ప్రజానీకానికి అన్నదానం చేయబడుతున్నది. భక్తుల హృదయాలలో పరమాచార్యుల వారి స్థానం అగణ్యమైనది. నడిచే దేవుడిగా ఆయనను ఆరాధిస్తారు. ఎన్నో సంవత్సరాల తపస్సంపన్నత ద్వారా వానాస్థితికి ఎదిగారు. తపశ్శక్తితో కూడిన పవిత్రత వల్లనే వారు వంద సంవత్సరాల వయస్సులో కూడా బంగారు మిసిమితో ప్రకాశిస్తున్నారు. వారిని దర్శిస్తూ నిలబడితే తేజోమూర్తియైన పరమాత్మను చూస్తున్నట్లు గానే వుంటుంది. వారికి ప్రపంచ మంతటా సామాజికంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా, వైజ్ఞానికంగా వివిధ స్థాయిలలో వున్నవారు, వివిధ జాతుల వారు శిష్యులుగా ఉన్నారు. అది వారి వ్యక్తిత్వ వైశిష్ట్యము. నేటికీ కంచి పీఠానికి, పరమాచార్య దర్శనానికి అనేక మంది విదేశీయులు వస్తుంటారు. చివరగా వ్యాసాన్ని వారి సందేశంతోనే ముగిస్తాను.

" అందరూ ఆనందాన్ని కోరుతారు. అందరికీ అది కావాలి. అయితే అది ఎక్కడ వుంది? బయట నుండి కనుపించే ఆనందం నిజమైంది కాదు. అది తాత్కాలికం. ఆనందం కోసం అన్వేషణ అంతర్ముఖంగా చేయాలి. ఇంద్రియాలను ఆపివేసి అంతర్ముఖ దృష్టిని అలవరచుకోవడం ఏకైక మార్గం. అదే ఆనందం బ్రహ్మరసం ' ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ రసోవైసః" అనితి తత్వాన్నే అంటారు. ఈ సత్యాన్ని ఎన్నో వందల సంవత్సరాల క్రితం ఆదిశంకరులు ప్రచారం చేశారు. వారి వారసులుగా, వారి పేరుతో జీవిస్తున్న మేమూ అదే చెపుతున్నాం.

- స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

## చిత్రసమీక్ష

(9వపేజీకొరవ)

కూడా చిత్రాన్ని నీరస పరిచింది. నటుడు సంజీవి మాటల రచయిత అవతారమెత్తి దానిలో విజయం సాధించాడు. ముఖ్యంగా న్యాయ వ్యవస్థ సాక్ష్యాల పైనే కాకుండా వాస్తవాల పై ఆధార పడాలంటూ రాసిన మాటలు బాగున్నాయి. చాలా రోజుల తర్వాత సంగీత దర్శకత్వం వహించిన చక్రవర్తి సంగీతం కొత్త బాణీ తొక్కలేదు. ముగ్గురు రచయితలు పాటలు రాసినా 'విజయాలు తొలి పొద్దుకు వందనాలు' మాత్రమే బాగుంది. అసలు లోకేషింగ్ కెమరానేనా అనే సందేహం కలుగుతుంది. ఫైట్స్ మాస్టర్ రాజు ఎస్.పి. చేత సాహసవంతమైన పోరాటాలు చేయించాడు. నటీనటుల్లో డాక్టర్ అశోక్‌గా నెల్లూరు యువకుడు సురేష్ హుందాగా పాత్ర పోషించారు. ఎస్.పి. పాత్రలో నూతన నటి శివరంజని కష్టపడ్డా పాపం ముఖాన భావాలు పలుకలేదు. మంజుల కూతురు బేబి శ్రీదేవి చక్కగా నటించింది. మిగతా వాళ్ల గూర్చి చర్చించక్కర్లేదు. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వాల్మీకిదే గాబట్టి సమర్థవంతంగా చిత్రాన్ని తీయలేని భారం కూడా ఆయనే భరించాలి.

## సినిమా

(9 పేజీ కొరవ)

కారణమని భావించడంలో పొరబాటు లేదు. ఒక పేరు మోసిన నిర్మాత చెప్పినట్లు ఇది వరకు షూటింగ్ చూడ్డానికి వచ్చిన జనం వల్ల అంతరాయం కలిగేదని సినిమా యూనిట్ వాళ్లు విసుక్కునే వారు. ఇప్పుడు సినిమా షూటింగ్‌లు జరిపే వారి వల్ల తమకు ఆటంకాలు జరుగుతున్నాయని జనం విసుకుంటున్నారు. ఆ మధ్య హైదరాబాదులో షూటింగ్ నిమిత్తం ఒక రోడ్డును పోలీసుల పోలీసులచే బంద్ చేయించినందు వల్ల ఆ రోడ్డులో ఆఫీసులకు వెళ్లే వారికి ఇబ్బంది ఏర్పడినందుకు చిన్న సైజు ఘర్షణ జరగబోయింది కూడా. మొత్తం మీద క్రమక్రమంగా సినిమా వారన్నా, సినిమాలన్నా ప్రజలకు మోజు తరుగుతున్నదన్న విషయం మాత్రం నిజం! ఈ ప్రభావం వసూళ్ల మీద ఎంతో కొంత ఉన్నదన్నది మరింత నిజం!

## జనవాణి

(3 పేజీ కొరవ)

### తిరునాళ్ల పేరుతో ఆర్టీసి దోపిడీ!

నరసింహ కొండలో ఇటీవల జరిగిన తిరునాళ్లను పురస్కరించుకొని ప్రజాసంక్షేమం కోసం పాటు పడుతున్నామని చెప్పే ప్రజాసంస్థ ఆర్టీసి ప్రజలను దోపిడీ చేసింది. నెల్లూరు నుండి ఇంత దగ్గర్లో వున్న ఈ పుణ్యక్షేత్రానికి ఛార్జీ 5 రూపాయలుగా వసూలు చేయడం దోపిడీ కాకుంటే మరేమిటి? ప్రైవేట్ బస్సుల మాదిరి కూడా ఆర్టీసి ఈ విధమైన చర్యలకు పాల్పడడం దారుణం.

నెల్లూరు – టి. శంకరయ్య

### వెంకటగిరి పంచాయితీ దుస్థితి

వెంకటగిరి పంచాయితీలో పనిచేసే అధికార్ల నిర్లక్ష్యం వల్ల గ్రామం రాను రాను భ్రష్టు పట్టి పోతున్నది. వీధి దీపాలు వెలగవు. మురుగు కాల్వలు ప్రతిదినం శుభ్రం చేయరు. వీధులంతా చెత్తా చెదారంతో నిండి వుంటాయి. పంచాయితీ మాంసం మార్కెట్‌లో నిఖార్సైన మాంసం దొరకడం లేదు. జబ్బు పడిన గొర్రెలు, మేకలు కోసి ప్రజల ఆరోగ్యంతో ఆటలాడు కుంటున్నారు.

వెంకటగిరి– కలవకూరి రమణయ్య

### అన్నిటికీ ఆద్యులాలు మహిళేనా?

కొన్ని నెలల క్రితం దిన పత్రికల్లో దూబగుంట మహిళ చేత సారా వ్యతిరేక వుద్యమం ఆరంభం అన్న శీర్షిక చూసాను. అటు పిమ్మట స్టేడియం వద్ద మహిళల సారా వ్యతిరేక ధర్నా తరువాత నెల్లూరు మహిళల అఖండ విజయం శీర్షికలు చదివి వుప్పొంగి పోయాను. కాని నేడు తడ వద్ద మహిళ చేత దొంగ సారాయి అమ్మకం. సూళ్లూరు పేట వద్ద మహిళ నుంచి సారా పాకెట్ల స్వాధీనం – అరెస్ట్ వార్తలు చదివి బాధపడ్డాను. అన్ని సంఘటనలకూ ఆద్యులాలు మహిళే!

నెల్లూరు – యద్దనపూడి సరోజిని

### ఇదా సాధించిన ప్రగతి ?

కోవూరు, రైకలూరు వుపఎన్నికలకు గాను రూపొందించిన రక్షణ వ్యవస్థను చూస్తే ఆశ్చర్య మేస్తుంది. నానాటికీ పతనమై పోతున్న ప్రజాస్వామ్య విలువలకు అద్దం పడుతుంది. వ్యవస్థకు పూతంగా నిలిచే ఓటును స్వేచ్ఛగా వేసుకోలేని దుస్థితి. దీనికి కారణం ఎవరు? ఈ పరిస్థితి ఎన్నాడు విడుతుంది?

నెల్లూరు – గుసుపాటి వేణుగోపాల్

బాహంతో గొంతు ఆరి పోతున్న తడి పాసులకు 'నిప్పో' యాజమాన్యం నీళ్ల సరఫరా చేస్తున్నది. తొలి ట్యాంకర్‌కు ప్రారంభోత్సవం చేస్తున్న జపాన్ టెక్నికల్ అడ్వయిజర్లు ఎస్. యొనెకావా, టి. కవానో

## పినాకినీ తీరం

(2 పేజీ తరువాత)

సహజంగా అయితే కాంగ్రెస్ అభ్యర్థి బలసమాపేతుడు. విజయధంకా మ్రోగించ వలసిన వాడు. తెలుగుదేశం అభ్యర్థి బలహీనుడు. గెలుస్తానన్న ధైర్యంగా చెప్పలేని బలహీనుడు. రేపు ఫలితం ఎట్లా వుండబోతుంది? — సహజంగానా, అసహజంగానా? ఎటు జరిగినా ఆశ్చర్యంలేదు; అటువంటి అయోమయస్థితి.

కాంగ్రెస్ అభ్యర్థి పెళ్లకూరు రామచంద్రా రెడ్డి తన సొంత కాళ్ల మీద నిలబడి పోటీ చేసి వుంటే ఏ విధంగా వుండేది? తల్లితండ్రి చాటు బిడ్డ అన్నట్లు, మాగుంట సుబ్బరామరెడ్డి గారి నీడన అభ్యర్థిగా పోటీ చేస్తే ఎట్లా వుంది? ఏది ఎవరి వ్యక్తిత్వాన్ని ఇనుమడింప జేస్తుంది. లేక దిగజారుస్తుంది? ఏది ఎవరికి లాభం. ఎవరికి నష్టం? ఈ ఎన్నిక మూలంగా ఎవరు ఏ పాఠాలైనా నేర్చుకోవలసిన అవసరం కలుగుతుందా? శుక్రవారం వెలువడబోయే ఫలితం ఎవరికి ఎటువంటి గుణపాఠం చెప్పబోతుంది? సమాధానాలు సంకట కరమైనవి కావచ్చు గాని. అనవసరమైనవి, అసందర్భమైనవి మాత్రం కాదు.

ఆర్ద్ర హృదయం, అరకొరగా వ్యవహరించడం, మాటకు చేతకు మధ్య తేడా లేక పోవడం శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి స్వభావం. ఏది చేపట్టినా, ఏది చేసినా మనసా వాచా కర్మణా పూర్తి నిమగ్నతతో చేయడం ఆయనకు అలవాటు. అందువల్లనే ఆయన కాంగ్రెస్ అభ్యర్థి పెళ్లకూరు అనుకోలేదు. తానే ననుకున్నారు. రాత్రింబవళ్లు, మండు టెండలో సైతం నియోజక వర్గంలోని ప్రతి అంగుళం నేలను తొక్కి, ప్రతి ఒక్కరినీ కలుసుకొని ప్రచారం చేశాడంటే పెళ్లకూరుకు చేస్తున్నాననుకోలేదు, తనకే ననుకున్నాడు. వేలు లక్షలు విలువ జేసే వాగ్దానాలు గావించాడంటే, ఎవరి కోసమో తాను దండగ్గా డబ్బు తగలేస్తున్నాననుకోలేదు, తన కోసం తాను వ్యయ పరుస్తున్నాననుకున్నాడు. తన సంస్థలకు చెందిన యావత్ యంత్రాంగాన్ని కోవూరు నియోజక వర్గం మీద పరచి వేశాడంటే, ఎవరి కోసమో తాను వృధా ప్రయాసకు గురియవుతున్నా ననుకోలేదు. తన కోసం తన వారిని వుపయోగించుకుంటున్నాననుకున్నాడు. పెళ్లకూరు జయాపజయాలు తన కీర్తిని భంగపరుస్తాయని భావించలేదు, ఆ గెలుపు ఓటములు తనవే ననుకున్నాడు. అందుకు సిద్ధపడ బట్టే ఆ ఎన్నికతో సుబ్బరామరెడ్డి గారు అంతగా తాదాత్మ్య మందగలిగారు; సర్వం తానై పని జేయగలిగారు; సర్వస్వం వొడ్డ గలిగారు; చివరకు వ్యక్తిగతంగా, తనసోదరులు, సంస్థల ప్రతిష్ఠను పణంగా పెట్టగలిగారు. ఎంత పార్టీ అభిమానమున్నా, ఎవరో అభ్యర్థి కోసం ఇంతటి అనుపమ త్యాగానికి సిద్ధపడే వారెందరుంటారు?

భీకరమైన ఒంగోలు పార్లమెంటు ఎన్నిక సమయంలో విజయుడై రాష్ట్ర ఖ్యాతిని పొందారు శ్రీ సుబ్బరామ రెడ్డి; తిరుపతి మహాసభను ఒక మయసభలా అపూర్వరీతిలో నిర్వహించి యావత్ దేశం దృష్టిని ఆకర్షించారు. ఇది రాజకీయాంశం. అంతకు ముందు వ్యాపార రంగంలో అంతర్రాష్ట్ర పలుకు బడితో, ఎంతటి సమున్నత స్థానంలో వుండినది తెలియని వారు లేరు. ఇతరులకు ఆయన్ను కలుసుకోవడం దుర్లభంగా వుండేది. ఒక పాటి వారికి అందుబాటు కానంత ఎత్తుకు ఆయన ఎదిగి పోయారు. వ్యాపార రీత్యాను, రాజకీయంగాను విశేష పలుకుబడి ప్రాభవాలు పొందిన సుబ్బరామరెడ్డి గారు ఒక శాసన సభ నియోజక వర్గ వుప ఎన్నికలో అంత లోతుగా మునిగి తేల తగి వుందా? సామాన్యులలో సామాన్యుడుగా మెలగడం, తన వద్దకు రావలసిన వారి దగ్గరకు తాను పోవడం అభినందనీయమే గాని, ఆక్షేపణీయం కాదు. కాని రాజకీయాలలో ఎంత ఎక్కువగా నిమగ్నమైతే మంచి గాని చెడు గాని దాని ప్రభావమూ అంత ఎక్కువగానే వుంటుంది. మంచిని ఆశించి ఆకాంక్షించి చేస్తే ఒక్కోసారి వ్యతిరేక ఫలితానికి దారి తీస్తుంటుంది. కోవూరు అనుభవం ఆయనలో తన పరిధులు. పరిమితులను గూర్చి ఆలోచింప జేయగలగాలి!

నారు

## ఫ్యాక్టరీ అమ్మకము – వేలం ప్రకటన

రామచంద్రాపురం సబార్డినేటు జడ్జి వారి కోర్టులో దాఖలా I.A. 310/86, O.S. 35/86 దావా గ్రంథమందు ది కోర్టు వారి ఉత్తర్వుల ప్రకారము, తూర్పు గోదావరి జిల్లా లక్ష్మి నరసాపురం (అనపర్తి వద్ద) గల M/s. డి.వి. రాజా (స్ప్రింగ్స్) ప్రైవేట్ లిమిటెడ్ ఫ్యాక్టరీకి చెందిన 'ఎ' మరియు 'బి' షెడ్యూలు ఆస్తులు బహిరంగ వేలములో విక్రయింప బడును. సదరు బహిరంగ వేలం రామచంద్ర పురం కోర్టు ఆవరణలో ది. 03/06/1993 వ తేదీన ఉదయం 10 గంటలకు జరుపబడును.

'ఎ' షెడ్యూలు ఆస్తి వివరములు

తూర్పు గోదావరి జిల్లా, అనపర్తి మండలంలో గల లక్ష్మి నరసాపురం గ్రామమందు గల జిరాయితీ మెరక భూమి విస్తరణ 3-89 సెంట్లు (1-5777 హెక్టార్లు) భూమితో పాటు, అందు గల ఫ్యాక్టరీ భవనం, ఆఫీసు భవనం, గోడౌనులు రెండును మరియు వాచ్‌మెన్ క్వార్టర్సుతో సహా.

'బి' షెడ్యూలు – మిషనరీ వివరములు

1. Hydraulic Fitting Press - Auto Pins (India). 60 Tonne Capacity with equipment.
2. Brinnal Harness Testing Machine - Avery India Ltd., with equipment.
3. Eye Rolling Machine with one set of mandrills - Auto Pins (India).
4. Double and eye grinding machine with leaf holding fixtures - Auto Pins (India).
5. Bush Fittings and sizing press (Hydraulic) - Auto Pins - 20 Tonnes Capacity.
6. Heavy duty drilling machine - Auto Pins (India) with equipment.
7. Arc welding transformer (Electroweld) - Weldon Machinery Corpon.
8. Flat cutting press - 50 tonne capacity - Auto Pins (India) with equipment.
9. Pre-bending and end cutting press for eye rolling - Auto Pins (India) 40 Tonnes.
10. Piller type Nibbing & End cutting press Auto Pin (I) 100 tonnes Capacity.
11. Hydraulic matching press with tools & revetting fixtures - Autopins. 60 tonnes.
12. Air Compressor - Elgi Equipments Ltd., with equipment.
13. Taper rolling Machine - Auto Pin (I) with equipment.
14. Scagging press with load indicating device - Autopins (India).
15. "Weldon" surface grinder - Weldon Machine Corporation.
16. "Power Pac" heavy duty double ended bench grinder - Widon Mach. Corpon.
17. Sizing & Coining Press - Auto Pins (India) 40 tonnes with equipment.
18. Second Laf forming machine - Auto Pin (India) with equipment.
19. Oil Burning equipment with Centrifugal air blower.
20. Furnace material & Cooling Tanks.
21. Advance Shop peening maching advance automatic & Process controls.
22. Cambering Machine - Autopins (India).
23. Piller Drilling Machine - Weldon Machinery Corporation.
24. Heating furnace with (Full equipment).
25. Heat Treatment Furnace (with full equipment).
26. Heat Treatment Quinching Tank.
27. Nibbing & End cutting furnace full equipment.
28. Main and Secondary forming furnace (full equipment).

వేలం షరతులు

1. 'ఎ' మరియు 'బి' షెడ్యూల్సు ఆస్తి ఒకే మొత్తంగా వేలం వేయబడును. 2. సదరు వేలం నందు పాల్గొను వారు ముందుగా రు. 1,00,000/- (అక్షరాలా ఒక లక్ష రూపాయలు) [illegible] 3. [illegible] 25 [illegible] 10 [illegible] 4. [illegible]

కె. శంకర రావు

[illegible] రామచంద్రపురం - 533 255 తూర్పు గోదావరి జిల్లా (ఆం.ప్ర) ఫోను: 2516

Nirmala Ads

## సింహపురి

4 పేజీ తరువాత

లేదు. ఈ రోడ్డు వెడల్పైతే చిన్న బజారుకుసౌకర్యం. రైలు కట్ట క్రింద వీధిలో నిలువు లోతు గుంటలు పడినా చూస్తూ వూరుకుంటున్నారు. అంత విశాల మైన రోడ్డులోకి వాహనాల్లో వెళ్లడానికి జనం భయపడి పోతున్నారు.

ట్రంకురోడ్డులో ముందుకు పొడుచుకొని వచ్చిన అంగళ్లను క్రమబద్ధం చేస్తే, రోడ్డు విశాలమౌతుంది. డివైడర్లు ఏర్పర్చినా, రెండు వైపులా రెండేసి వాహనాలు ఒకేసారి వెళ్లగల్గే వీలు కల్గుతుంది. అది చేయగల్గితే గాంధీ బొమ్మ నుంచి విఆర్ కాలేజీ వరకు భూప్రదక్షిణ చేసి స్కూటర్స్ తప్పు. ఎక్కడి కక్కడ అడ్డదిడ్డంగా కనెక్ట్ పెట్టవచ్చు. రిక్షాల వల్ల రిక్షాల్లో ప్రయాణించే వారికి యాతనగా వుంది. బాధలుగిటా పెరిగి పోతున్నాయి.

## రిటైర్డ్ టీచర్స్ అసోసియేషన్

నాన్ గవర్నమెంటు రిటైర్డ్ టీచర్స్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం 25 తేదీ కె.వి.ఆర్. మునిసిపల్ ప్రాథమిక పాఠశాలలో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో అధ్యక్షునిగా కె. సంపత్ కుమార్, ఉపాధ్యక్షునిగా ఎన్నారు క్రిష్ణమూర్తి, ప్రధాన కార్యదర్శిగా డి. కోటయ్య, కార్యదర్శులుగా జి. రామమూర్తి, కె.వి.పి. శర్మతో పాటు మరో 14 మంది కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు. రిటైర్డ్ టీచర్స్ అసోసియేషన్ మాజీ అధ్యక్షుడు సురభి రామయ్య ఎన్నికల తంతును పర్యవేక్షించారు.

విజయ వక్కపొడి

రుచి అమోఘం – ధర స్వల్పం

వివాహాది శుభ కార్యములకు •
500 గ్రా. 200 గ్రాముల ప్యాకింగ్‌లో
సరసమైన ధరలకు లభించును.

విజయ వక్కపొడి
ట్రంకురోడ్డు – నెల్లూరు
ఫోన్: 23372

PHONE: 27788

MODERN SCHOOL

Recognised by the Govt. of A.P.
SARASWATHI NAGAR, NELLORE - 524 002

✔ WE ARE ON TOP OF THE LINE.
✔ IN INTRODUCING COMPUTER AIDED TEACHING FROM KINDERGARTEN
✔ TO TOP IT OFF
✔ OUR STUDENTS ARE THE DISTRICT RANKERS IN PUBLIC EXAMS
✔ IT IS BUT NATURAL IF EVERY BODY CALLS MODERN SCHOOL
✔ A TOP SCHOOL

ADMISSIONS
From Play Class to Tenth Class Commenced

# S.M.S. NATIONAL JUNIOR COLLEGE

Aravinda Nagar, NELLORE - 524 003.

## ప్రవేశ ప్రకటన - Admission Notice

**1993 - '94** విద్యా సంవత్సరమునకు కళాశాల క్రింది కోర్సులకు ప్రవేశమును ఇస్తుంది.

| జెనరల్ కోర్సులు | | |
|---|---|---|
| | Part I - | ఇంగ్లీషు |
| | Part II - | సంస్కృతం/తెలుగు/హిందీ |
| | Part III - | M.P.C. / Bi.P.C / C.E.C |

ఇంగ్లీషు, తెలుగు మీడియంలలో బోధన వుంటుంది.

వొకేషనల్ కోర్సు కొరకు కాలేజి ఆఫీసు నందు సంప్రదించండి.

ప్రవేశమునకు అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టస్ **May '24** వ తేది నుండి కాలేజి ఆఫీసు నుండి **Rs. 20/-** చెల్లించి పొందవచ్చు.
భర్తీ చేయబడిన అప్లికేషన్లు తిరిగి యివ్వవలసిన ఆఖరు **17.6.93** తేది మాత్రమే.

గమనిక: బయట ఊరి నుండి వచ్చు ఆడ పిల్లలకు మాత్రమే హాస్టల్ వసతి ఉంది.

– ప్రిన్సిపాల్

## స్టాండర్డ్ కోచింగ్ ఇన్‌స్టిట్యూట్

రామలింగాపురం, నెల్లూరు -3, ఫోన్: 29592




## స్టాండర్డ్ రెసిడెన్షియల్ కాలేజి

రామలింగాపురం, నెల్లూరు -3, ఫోన్: 29592

### INTER, EAMCET లకు అత్యుత్తమ శిక్షణ

- జూనియర్, సీనియర్ ఇంటర్ M.P.C., Bi.P.C గ్రూపులకు రెగ్యులర్ ట్యూషన్లకు అడ్మిషన్లు జరుగుచున్నవి.
- సీనియర్ ఇంటర్ క్లాసులు జరుగుచున్నవి.
- రెండవ బ్యాచ్ **26.5.93** నుండి ప్రారంభమగును.
- సీనియర్ ఇంటర్ సిలబస్ సెప్టెంబరు నెల లోపల పూర్తి చేసి అక్టోబర్ నుండి EAMCET కోచింగ్ ఇవ్వబడును.

జూనియర్ ఇంటర్ క్లాసులు **26.5.93** నుండి ప్రారంభమగును.

కె. శ్రీనివాసులు రెడ్డి, మాథమాటిక్స్ — డైరక్టర్లు — జి. సుబ్బారెడ్డి, కెమిస్ట్రీ

### INTER, EAMCET లకు అత్యుత్తమ శిక్షణ

- జూనియర్ మరియు సీనియర్ ఇంటర్ M.P.C., Bi.P.C. గ్రూపులకు అడ్మిషన్లు జరుగుచున్నవి.
- ఇతర కళాశాలల్లో జూనియర్ ఇంటర్ చదివిన విద్యార్థులకు సీనియర్ ఇంటర్‌లో ప్రవేశము కలదు.
- క్లాసులు **14-6-1993** తేది నుండి ప్రారంభం

జూనియర్ ఇంటర్‌లో సెమీ రెసిడెన్షియల్ విద్యార్థులకు ఫీజు రూ. 3,000/- లు (కోచింగ్ + స్టడీ మెటీరియల్) ఈ విద్యార్థులు ఇతర కళాశాలల్లో చేరవలసిన అవసరం లేదు.

- ప్రతి రోజు బోధనానంతరం అధ్యాపకుల పర్యవేక్షణలో విద్యార్థులకు చదివించడం జరుగుతుంది.
- పదవ తరగతిలో అత్యధిక మార్కులు సాధించిన విద్యార్థులకు ఫీజులో రాయితీ

కె. శ్రీనివాసులు రెడ్డి, మాథమాటిక్స్ — డైరక్టర్లు — జి. సుబ్బారెడ్డి, కెమిస్ట్రీ

మాథమేటిక్స్, ఫిజిక్స్, కెమిస్ట్రీ సబ్జెక్టులకు పోస్టు గ్రాడ్యుయేట్ రెసిడెన్షియల్ ట్యూటర్లు కావలెను.

## స్టాండర్డ్ కోచింగ్ ఇన్‌స్టిట్యూట్ వారిచే నిర్వహించబడు విద్యా సంస్థ

## శ్రీ భారతి జూనియర్ కళాశాల

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిచే గుర్తింపబోవుచున్న విద్యా సంస్థ)

రామలింగాపురం, నెల్లూరు -3, ఫోన్:29592

### జూనియర్ ఇంటర్ M.P.C. మరియు Bi.P.C. గ్రూపులకు ఇంగ్లీషు / తెలుగు మీడియంలలో ప్రవేశము

- ప్రతి సబ్జెక్టులోను అనుభవం గడించిన అధ్యాపకులచే అత్యుత్తమ శిక్షణ.
- మా కళాశాల యందు చేరిన విద్యార్థులకు మరియే ఇతర ట్యూషన్ అవసరం లేకనే శిక్షణ.
- ప్రతి రోజు బోధనానంతరం అధ్యాపకుల పర్యవేక్షణలో విద్యార్థులను చదివించుట.
- విశాలమైన అధునాతన భవనములలో క్లాసులు మరియు ప్రయోగశాల.
- క్రమముగా పరీక్షలు నిర్వహించి వారి ప్రోగ్రెస్‌ను తల్లిదండ్రులకు తెలుపుట.

వివరములకు స్వయంగా సంప్రదించగలరు.

కరస్పాండెంట్

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore. OFFSET Printing at Nayagara Books (P) Ltd.